బొమ్మల

# యశపాల్

(1903 - 1976)



మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవితచరిత్ర
" అక్బర్ బీర్‌బల్ వినోదకథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్యకథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహసకథలు 2 భాగాలు
" భేతాళకథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మదర్ థెరిస్సా
" రవీంద్రనాథఠాగూర్
" యోగి వేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖరఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

శత్రువుల తుపాకి గుండ్లకు ఎదురు నిల్చెదము
స్వేచ్ఛగా ఉంటాము మేము స్వేచ్ఛగా ఉంటాం...
—అజాద్ చంద్రశేఖర్.

అలాంటి విప్లవ వీరులకు సహచరుడు యశపాల్. భగవతీ చరణ్‌తో కలిసి ఢిల్లీ వైస్రాయి. పయనించే ట్రెయిన్ బాంబుతో కూల్చాడు. గాంధీజీ శాంతి వాదం సవాల్‌కు జవాబుగా "బాంబుదర్శనం" విప్లవ కరపత్రం ప్రచురించిన వీర కిశోరం, ఉద్యమ మార్గంలో ఎదురు దెబ్బలు తిని "కాగడా" కోట శిధిలాల్లో కూర్చుని ఓ మారు అనుకున్నాడిలా...

"నిర్జనమైన కొండల్లో కోనల్లో దాక్కుని బాంబుల్ని తయారు చేసి విప్లవాగ్నిని సృష్టిద్దామనుకోవటం మూర్ఖమైన ఆలోచన. ప్రజా సామాన్యం వల్లనే కదా విప్లవం సంభవం అయ్యేది? మరి, అలాంటప్పుడు ప్రజాస్వామ్యానికి దూరంగా నిర్జీవ ప్రదేశాల్లో వుండి విప్లవాన్ని సృష్టిద్దామనుకోవడం మూర్ఖత్వము కాదా? లక్షల సంఖ్యలో మానవులు ఒకర్ని గురించి మరొకరు పట్టించుకోకుండా ఎవరి పనుల్లో వాళ్ళు, ఎవరి బురదలో వాళ్ళు, మునిగి తేలుతుండే మహానగరాల్లో మకాం పెట్టటం అవసరం." —(యశపాల్)

# హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్ర సేన-సేనాని

క్రాంతికారి యశపాల్ పోలీస్ బందీ అయ్యాడు. ఎప్పుడు? ఎక్కడ? ఎలా?

అంతకుముందు అజాద్ చంద్రశేఖర్, యశపాల్‌ను రష్యా పంపించే ప్రయత్నంలో ఉండి. ఆల్‌ఫ్రెడ్‌పార్క్ అలహాబాద్‌లో తేది 27 ఫిబ్రవరి 1931

నాడు ఆంగ్ల సిపాయిలతో వీరోచితంగా పోరాడుతూ చివరగా తన పిస్తోలుతో తనను కాల్చుకుని స్వేచ్ఛగా అమరుడై నాడు.

23 మార్చి 1931 నాడు లాహోరు జైల్లో విప్లవవీరులు భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్ ఒకేసారి ఉరితియ్యబడ్డారు.

పోలీసుల నిగరానీ పెరిగింది. క్రాంతికారులు అరెస్టులు ఎక్కువైనవి. విప్లవకారులను పట్టి యిచ్చిన వారికి బహుమతులను ప్రకటిస్తూ పోస్టర్లు అంటించ బడినై వాటి నన్నింటిని తప్పించుకొని యశపాల్ తమ సంస్థను బలపరచాలని యెంచాడు. ఆజాద్ వీరమరణంతో లోటు కలిగిన సంఘ నాయకుని ఎన్నుకోవటం కోసం అనేక ప్రాంతాలకు తిరుగుతూ మిత్రులను కలుసుకొని సంస్థ సమావేశము "హాపుడ్"లో జరిపాడు.

"మన సంస్థకు ఆధారం మన ఆశయాలే. మన ఆలోచనలను ప్రచారం కావిస్తూ ప్రజల్లో మన యెడల సానుభూతిని వ్యాపింప జేసుకుంటూ- దళాన్ని పెంచుదాం" అన్నాడు యశపాల్. ఇంకా కార్యకర్తలందరూ స్వతంత్ర (స్వావలంబ) జీవనం కలిగి ఉండాలని, పరస్పర సంప్రదింపులు సహకారం ద్వారా రహస్య ఉద్యమం సాగించాలని కోరాడు. సంస్థకోసం ఒక ప్రింటింగ్ ప్రెస్సు అవసరాన్ని సూచించాడు.

అతని సూచనల్లో డబ్బు విషయం మిత్రులకు రుచించలేదు. డబ్బు నంపాదనకోసం ఏదైనా ఒక "యాక్షన్"- ఎత్తుగడ (దోపిడీ) వేయాలని వాళ్ళ తలంపు, డబ్బు తగినంత లేనిదే ఏమీ చేయలేమని భావించారు. సొంతగా బతకాలి ఉద్యమం సాగించాలి అంటే వాళ్ళకు కష్టంగా తోచింది.

సరే మీకు నచ్చిన నిర్ణయం మీరు చేయండి. నాకు నచ్చితే మీతో

కలసి ఉద్యమంలో పాల్గొంటాను అని వెళ్ళి వచ్చాడు. రష్యావెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు. అది ఆజాద్ కోరిక.

మరో సమావేశం "గఢ ముక్తేశ్వరం" గంగా స్నాన సందర్భంలో జరిగింది. అందులో ఎక్కువమందే పాల్గొన్నారు. అనేక సమాలోచనలు అనంతరం సైద్ధాంతిక కార్య నిర్వహణ సురేంద్ర పాండే స్వీకరిస్తూ, సాయుధ పోరాట నాయకత్వ బాధ్యత యశపాల్ వహించాలన్నాడు. మిగతా మిత్రులు అందుకు ఆమోదించారు.

యశపాల్ "హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీ" సర్వ సేనాని అయినాడు. ఆజాద్ ఆపదవిలో మొదటివాడు యశపాల్ రెండవవాడు, చివరవాడు కూడాను.

సిద్ధాంతాల విషయంలో సడలింపు ఉండకూడదని, ఆందోళనలతో కాక గెరిల్లా పోరాటాలద్వారా ఉద్యమం నడిపించాలని దేశవిముక్తి గమ్యంగా ప్రజల అభిమానము సహకారం పొందుతూ ముందుకుసాగాలని నిర్ణయం తీసుకున్నారు.

అప్పుడు యశపాల్ సంతకంతో ఒక కరపత్రం వెలువడింది.

"హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్ర సేవ బలం కేవలం చెల్లాచెదురై యున్న ఏ కొందరో సాయుధ పోరాట యువకులు మాత్రమే కారు. దేశంలోని కోట్లకొలది జనం, ఎవరి హృదయాల్లో ఆంగ్ల ప్రభుత్వంపై విముఖత వారి అత్యాచారాల యెడల అసహ్యం ఉందో, దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే ఆసక్తి శక్తి ఉందో వారందరూను.

విదేశ అధికారాన్ని ఎదిరించడానికి రైఫిల్లు, బాంబులకోసం ఎదురు చూడవలసిన పనిలేదు. పర ప్రభుత్వం ఆధీనంలో ఉన్న ఆయుధాలన్నీ మనవే. మీ చేతిలో ఏ సాధనం ఉంటే అదే మీ ఆయుధం" ఇదీ వారి దృక్పథం.

# బందీ జీవనం

22 జనవరి 1931 నాడు సంఘ సభ్యుడయిన కృష్ణశంకర్‌ను కలుసుకోవడానికి అలహాబాద్ వెళ్ళాడు యశపాల్. ఆయన ద్వారా బెంగాల్ ప్రతినిధులను కలవాల్సి ఉంది. యశపాల్ ఢిల్లీనుంచి రాత్రి తొమ్మిదిన్నర గంటలకు అలహాబాద్ చేరుకున్నాడు. టిబెట్‌రోడ్, కృష్ణా హోటల్ పై అంతస్తులో జిరిష్ వనిత సావిత్రీదేవి ఇంట్లో మిత్రుడు చెప్పిన అడ్రస్సు ప్రకారం కల్సుకున్నాడు. అక్కడ వాళ్ళు చక్కగా ఆదరించారు. తిని నిద్రించారు.

ఉదయమే నిద్రలేవటం యశపాల్‌కు గురుకుల విద్యాభ్యాసం వల్ల చిన్ననాటి నుంచి అలవాటు, అయిదు గంటలకు అతడు లేచే సరికి "చాయ్ తయారు చెయ్యనా?" అంది సావిత్రీదేవి. ఆ చలికాలపు ఉదయంవేళ పడకనుంచి లేచేసరికి వేడిపొగలు వెదజల్లు టీ కప్పు లభించడం ఎంత ఆనందం, ఒప్పుకొన్నాడు. ఆమె స్టౌ వెలిగించింది.

ఇటు వీధి తలుపు చప్పుడయింది. శ్రీవాస్తవ్ రావచ్చు ననుకొన్నాడు యశపాల్, వచ్చింది పోలీసులు, తలుపు తెరువమని ఒత్తిడి చేస్తున్నారు. క్షణంలో ఆత్మరక్షణకు సిద్ధపడి ఆమెను తలుపు తెరువమన్నాడు.

ఆమె ముందుకు నడిచింది అలా బోనులో పులిలా చిక్కుపడి శత్రువుల నెదుర్కొవటం కంటే, తప్పించుకొని బయటపడే మార్గమేదైనా ఉంటుందేమో అని ఇంటిలోపలికి వెళ్ళాడు. అపరిచిత గృహం వెనుక భాగంలో చిన్నవాకిలి దానినానుకొని, నీటిగొట్టం ప్రక్కగా రేకుగోడ ఉంది. ఎగిరి దానిపైకి ఎక్కాడు, దాటి పోవాలని, వెనుకగా పిస్తోల్ ప్రమోగింది. గుండు తన తలపైనుండి దూసుకు వెళ్ళింది. ముందుకు తొంగి చూశాడు. కాకీ డ్రెస్సులవాళ్ళు గోడచాటుగా నక్కి



ఆయుధాలు గురిపెట్టి చూస్తున్నారిటువైపే, ముందు చూస్తే నుయ్యి వెనకపోతే గొయ్యి, అన్నట్లు రెండు దెసలనుంచి కాల్పులు, దెబ్బలు తప్పించుకుంటూనే కాల్పులు సాగించాడు. పిస్తోల్‌లో ఉన్న ఆరుగుండ్లు అయిపోగానే దాన్ని, తన వైపు పిస్టల్ గురిపెట్టి చూస్తున్న స్పెషల్ పోలీస్ సూపరింటెండెంట్ డి. ఫిల్డిచే తలకు గురిపెట్టి కొట్టాడు. అతడా దెబ్బను తప్పించుకొన్నాడు.

ఇతని వద్ద ఆయుధాలు లేనిది తెలుసుకొని ఆ ఆంగ్ల ప్రభుత్వాధికారి ఈ విప్లవ వీరునితో మర్యాదగా మాట్లాడినాడు. పేరుపెట్టి సంబోధించి, దెబ్బలు తగల్లేదు కదా, అని పరామర్శించాడు. అన్నీ తెల్సుకొనే వచ్చాడు. అతని మర్యాదకు ఇతడూ వినమ్రుడైనాడు. ఆంగ్లేయులు ఎంతటి కర్కశులనుకున్నా వారిలోనూ సౌజన్యం కలవారు లేకపోలేదు. బొగ్గు జాతివే కదా వజ్రాలు కూడాను!

రాత్రి దుస్తులతో ఉన్న యశపాల్‌ను "మీరు ప్రత్యేక పద్ధతిలో డ్రెస్సు ధరిస్తారని తెల్సు, లోపలికి వెళ్ళి దుస్తులు మార్చుకొని రండీ, మేం వేచి ఉంటాం." అన్నాడు ఫిల్డిచే.

అతడు లోపలికి వెళ్ళి ఒక కంబళి మాత్రం తీసుకొన్నాడు. "నా వలన మీకు ఇబ్బంది కలిగినందుకు క్షమించండి" అన్నాడు సావిత్రీదేవితో, ఆమె మౌనంగా చూస్తూ నిలిచింది.

"ఐరిష్ స్వాతంత్ర పోరాట చరిత్ర" ఆమెకు తెలువంది కాదు. భారత స్వాతంత్ర్య పోరాట ఘట్టంలో ఒక వీరుని తన కళ్ళముందు చూస్తున్నది. చలి వేళ వేడి చాయ్ కప్పు అతనికి అందించాలని ఆశపడింది ఆ మహిళ, కాని సంకెళ్ళు ఎదురుగా వచ్చాయతనికి.

"వీటి అవసరం లేదనుకుంటాను."

"మీ యిష్టం."

"వద్దు తీసుకెళ్ళు" అన్నాడు బంట్రోతుతో ఫిల్డిచ్, ఆ వీధిలో ఒక కారు మూడు పోలీసు ట్రక్కులు ఉన్నాయి.

కారు వెనుక సీటులో ఒక వైపు ఫిల్డిచ్, మరోవైపు ఇంకొక పోలీసాఫీసర్, మధ్యలో యశపాల్ కూర్చున్నారు. ముందుసీట్లో డ్రైవర్ ప్రక్కగా ఒక సాయుధ సిపాయి కూర్చున్నాడు. కారు కదలింది పోలీసుల లారీలు వెంట రాగా,

త్రివర్ణ పతాకాలు పట్టుకొని "వందేమాతరం" "స్వతంత్ర భారత్‌కో జై, నినాదాలు చేస్తూ "ప్రభాతభేరి" ఊరేగింపుగా వచ్చిన కాంగ్రెసువాళ్ళ గుంపు ఈ తతంగమంతా చూస్తూ విస్తుపోయి నిలిచారు. 1929 లాహోరు కాంగ్రెసు

మీటింగ్‌లో నెహ్రూజీ దేశంలో మొదటిసారిగా జాతీయ జెండా ఎగురవేసి 26 జనవరిని భారత స్వాతంత్ర్య దినంగా ప్రకటించినసుండి, స్వతంత్ర్యము రాకున్నా ఏటా జనవరి 26కు ముందు 7 రోజులు "స్వాతంత్ర్య సప్తాహము" జరుపుతున్నారు ఆ పార్టీ వాళ్ళు ఆ సందర్భంలోదే పై జట్టు.

మరునాడు యశపాల్ బందీగాఉన్న జైల్లోకి ఇద్దరు పోలీస్ అధికారులు వచ్చారు.

"ఎలాగో చివరికి నిన్ను పట్టుకున్నాం" ఒకతనన్నాడు.

"మీరెవరో తెలియనందుకు విచారపడుతున్నాను". చల్లగా బదులిచ్చాడు యశపాల్.

"మేము నీకు తెలియదా? మీ పిస్తోలు గుళ్ళతో మా బుర్రలు పగలగొట్టాలని ఎన్నిసార్లు మా బంగ్లా చుట్టూ తిరిగారో..."

"ఆ భయంతో రాత్రిపూట మీకు నిద్రపట్టేది కాదనుకుంటా నిజంగా మీరు నాకు తెలియదు."

యు.పి. పోలీస్ ఇన్స్‌పెక్టరు జనరల్ హోలింగును తన పరిచయం చేసుకొని, రెండవ వ్యక్తి సి.ఐ.డి. పోలీస్ డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ జనరల్ మిస్టర్ షా అని తెలిపాడు- అతడడిగిన ప్రశ్న.

"మీరీ మార్గం ఎందుకు స్వీకరించారు?" అని.

"మరో మార్గం లేక, ఇంకే మార్గంలో చెప్పినా మీరు వినరు గనుక" యశపాల్ బదులిచ్చాడు.

"అంటే?" సరిగా అర్థంకాకనో వివరానికో.

"అర్థం మీకు తెల్సు, మా దేశ ప్రజల్లో నూటికి తొంబదిమంది శవ

జీవితాలు గడుపుతున్నారు. వారు తమ జీవితాలను బాగుచేసుకోవాలనుకుంటున్నార. కాని, మా దేశ ప్రజల ప్రయత్నాలన్నీ పరాయి ప్రభుత్వపు ఉక్కు పంజాతో నలిగిపోతున్నయ్. మా దేశ స్వాతంత్ర్యం సాధించడానికి మరే దారి లేక ఈ మార్గాన్ని ఎన్నుకున్నాం-'' యశపాల్ వివరించాడు.

"స్వాతంత్ర్యం పొందాలంటే గాంధీజీ సత్యాగ్రహం సరియైన మార్గం" మీ విధానం సరియైంది కాదు అనే ధోరణిలో అన్నాడు.

"గాంధీగారి సత్యాగ్రహానికి మీరు విలువిస్తున్నారా? లేదు. ఆ ఉద్యమం సరియైనదనుకున్నప్పుడు, మీరా ఉద్యమకారులపై ఎందుకు లాఠీఛార్జీ చేస్తున్నారు ఎందుకు కాల్పులు జరుపుతున్నారు? (ఎందుకు జైళ్ళల్లో తోస్తున్నారు.) కాంగ్రెసునే నిషేధించారు కదా. (1930 దండి ఉప్పు సత్యాగ్రహం తర్వాత కాంగ్రెసును రద్దుచేసి గాంధీజీనే అరెస్టు చేశారు. ఆ పదిమాసాల్లో బందీలైన శాంతి సత్యాగ్రహులు 90 వేల మందిట!) అది మార్గమనే ఇన్ని చేస్తున్నారు?"

జవాబు చెప్పకే వెళ్ళారు వాళ్ళు. స్వార్థంతోచేసే వాదనలు సత్యాన్ని తేల్చవు- అంగీకరించవు.

## జైల్లో పెళ్ళి—

"లాహోర్ నివాసి కుమారి ప్రకాశవతీ కపూర్, బరేలీ సెంట్రల్ జైల్లో బందీగా ఉన్న దౌర్జన్యకారుడైన యశపాల్‌ను వివాహం చేసుకోగోరుతున్నది. ఖైదీ ఉద్దేశ్యమేమిటి? పెళ్ళికి అంగీకారమేనా- కాదా- తెలియపరచేది-"

డిప్యూటీ కమీషనర్ గారి లేఖ. ఒక క్షణం ఆలోచించాడు యశపాల్ ఆమోదించాడు. 7 ఆగస్టు 1936నాడు వారి పెళ్ళి జైలులోనే రిజిస్ట్రేషన్ చెయ్య

బడింది. ఆ రోజు ప్రకాశవతి ఆఫీసుకు రాగానే యశపాల్‌ను అక్కడికి పిలిచారు. ఇద్దరు రిజిస్టరులో సంతకాలు చేశారు. పెళ్ళి అయింది. (ఖైదీలకు మిఠాయి పంచారట. అరగంట మిత్రులతో కలిసి మాట్లాడుకున్నారట.) తిరిగి అతడు లోపలికి వెళ్ళాడు. ఆమె వెలుపలికి నడిచింది. ఇదీ వారి వివాహ వైభవం.




ప్రకాశవతి ధనవంతుల ఇంటి అమ్మాయి. 1930లో ఉద్యమంలో చేరింది. పెళ్ళి తప్పించుకొని ఇల్లు వదిలేసి వచ్చింది. మొదట కాంగ్రెసు కార్యకర్త. తర్వాత క్రాంతికారిణి. ఇంచుమించు అందరూ అరెస్టయిన తర్వాత 1934లో అరెస్టు కావించబడింది.

జైలునుంచి విడుదల పొందిన తర్వాత ప్రకాశవతి జీవితమేమిటా? అని ఆలోచించాడు యశపాల్? తనవంటి బ్రతకలేని వానిని కాక, ఎవరినైనా ఒక యోగ్యుని పెళ్ళాడుమని చెప్పాలి అనుకుంటున్నాడు. ఆమె అతన్నే పెళ్ళాడింది. ఉద్యమ జీవితంలో వారిద్దరు మంచి మిత్రులు.

## పదేండ్లకు ముందే విడుదల—

2 మార్చి 1938 సంధ్య వేళ. మహారాష్ట్ర జైలు మంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్ జైలు ఉద్యోగులతోపాటు యశపాల్ గదిలో అడుగుపెట్టాడు. నమస్కరించి కూర్చోమ్మని యశపాల్ ఆదరం చూపించాడు.

"నడువ్" అన్నాడు మంత్రి.

"ఎక్కడికి?" అడిగాడితడు.

"ఇంటికి- మీ పుస్తకాలు బట్టలు సర్దుకోండి".

తన కారులోనే తీసుకెళ్తూ అడిగాడు మంత్రి.

"ఇప్పుడెలా అనిపిస్తున్నది విడుదల పొంది."

"విచిత్రంగా అనిపించుతుందని అనుకున్నాను. కాని పూర్తి ఆశతో ఎదురుచూసి విడుదల పొందాను, కనుక ఇప్పుడు మామూలుగానే ఉంది. యశపాల్ జవాబు.

కాంగ్రెసు నాయకులు కూడా ఇతర ప్రతిపక్షాల వారి వలె ఎన్నికల్లో నిలబడి 1937లో అసెంబ్లీలో పెద్ద సంఖ్యలో ప్రవేశించాడు. వారి ఎన్నికలలో రాజకీయ ఖైదీలనందరినే విడిపిస్తామని ఉంది. కాని, శాంతి సత్యాగ్రహాలనే కా

విప్లవ కారులను కాదని మాట మార్చారు తర్వాత. హింసామార్గంలో విశ్వాసం లేదని శాంతి మార్గాలననుసరిస్తామని హామీ ఇస్తేనే వీరిని వదులుతారట.

"మొదట మా మార్గం హింసకాదు. ఇప్పుడు మార్చుకునే ప్రసక్తి లేదు." అని మిన్నకున్నాడు యశపాల్. తమది సాయుధ పోరాటమే కాని హింసకాదని ఆయన వాదన విడుదల కాలేదు. టి.బి.తో ఆయన ఆరోగ్యం చెడి పోయింది. రహస్య లేఖలు మూలంగా ప్రకాశవతికి విషయాలు తెలిసేవి. ఆమె జైలు మంత్రి దగ్గరకి మాటి మాటికి వెళ్ళుతూ ప్రార్థించి భక్తి విడుదల అయ్యేలా చూసింది.

అప్పటి యు.పి. ముఖ్యమంత్రి పండిత గోవింద వల్లభ పంత్, ఆయన కాకోరి కుట్రకేసులో విప్లవకారుల పక్షాన వాదించిన ప్రముఖ న్యాయవాది.

## పులిచిక్కినా చారలు సన్నబడవు—

జైలు నుంచి విడుదల పొందినా పంజాబ్ ప్రవేశాన్ని నివేధించారు! బహు శ్రమతో జీవితాన్ని గడుప సాగారు.

తల్లి ఇచ్చిన 300రూ॥తో "విప్లవం అనే హిందీ మాసపత్రికను ఆరంభించాడు యశపాల్. తాను వ్రాత, అచ్చు, పంపిణి పనులు చూసుకునేవాడు. భార్య పత్రికకు చందాదారులను చేరుస్తూ డబ్బు సమకూరుస్తుండేది.

అప్పటికి అదే మొదటి విప్లవ పత్రిక. యశపాల్ సంపాదకుడు. అనుభవం కల క్రాంతికారి కాబట్టి త్వరలోనే మంచి ప్రచారాన్ని పొందింది. ప్రభుత్వం దృష్టిలో పడింది.

1940లో ఒకనాడు స్థానిక పోలీసు అధికారి పిలువనంపాడు. ఇతడు వెళ్ళాడు. అతని ఎదుట కుర్చీలో కూర్చున్నాడు. ఆఫీసర్ ఏమీ మాట్లాడలేదు. యశపాల్ వైపుగా టేబిల్ పై కాళ్ళు పెట్టాడు. అది చూసి వెంటనే ఆఫీసర్ దిక్కుగా అదే బల్లపై తన కాళ్ళుంచాడు.



“ఇక వెళ్ళవచ్చు. నాకు సాక్ష్యం లభించింది” అన్నాడతడు కాళ్ళు క్రిందికి మార్చుకుంటూ.

యశపాల్ వెళ్ళివచ్చాడు. మరునాడు పత్రిక ఆగిపోయింది. యశపాల్‌ను అరెస్టు చేసి 12వేల ధరావత్తు కోరినారు. డబ్బు చెల్లించలేదు. పత్రిక ఆగిపోయింది.

జైలునుంచి విడుదల పొందినా పత్రిక నడవలేదు. బతుకు గడవడము కోసం మట్టి, కాగితం బొమ్మలు చేసారు. వీధుల్లోని రద్దీ సుతిలే తెచ్చి బ్యాగులు, ఇంకా తోలుసీట్లు తయారుచేసి అమ్మారు. ప్రకాశవతి దంతవైద్యురాలిగానూ మారింది. ఆ పరికరాలూ అమ్మవలసి వచ్చింది. కష్టంగా జీవితం గడుపుతూనే అతని రచనలు ముద్రించసాగారు.

## విద్వాన్ సర్వత్ర పూజ్యతే—



యశపాల్ ఆయుధ వీరుడు మంత్రమే కాదు. అంతకు మించిన కలం వీరుడు.

ఆయన విప్లవ జీవితం సహచరుల అనుభవాలతో "సింహావలోకన్" పేర 3 భాగాలుగా వ్రాసి ప్రచురించాడు. అందులోని కొన్ని భాగాలున్నూ, మార్క్సువాద పాఠశాలపేర సామ్యవాద వ్యాసాలూ "విప్లవ్" పత్రికలో సీరియల్‌గా వచ్చాయి. 80 పేజీల ఆ పత్రికలో ఎక్కువ భాగం అతని రచనలే మారు పేర్లతోనూ వచ్చేవి.

1939-42 మధ్యకాలంలో ఆయన ప్రతిభకల రచనలు వెలువరించాడు.

యశపాల్ రచనలు మరాఠీ, గుజరాతీ, తమిళం, తెలుగు, మళయాళం, బెంగాలీ, సింధీ, ఉర్దూ, మొ॥ స్వదేశ భాషల్లోనేకాక రష్యన్, ఫ్రెంచి, చెక్, ఆంగ్లభాషల్లోనూ అనువదించ బడినాయి. ఆయన హిందీ రచయిత.

యశపాల్ ఇంత ఖ్యాతి పొందిన రచయిత అయినా వేషధారణలో భాషాధోరణిలో ప్రత్యేకతగా కళాకారుడుగా కన్పించేవాడు కాదు. తన కాలం రచయితలకంటె తక్కువ కాలమే సాహిత్యరంగంలో అతడున్నప్పటికి 40 పుస్తకాల వరకు, ప్రతిభావంతమైన రచనలు వేలు వరించాడు. అవీ చౌకబారు శృంగార హాస్యాల మేళవింపు రచనలు కావు. మానవుని మేధస్సుకు మేతపెట్టి సమాజానికి ఉత్తేజము కల్గించి ప్రభుత్వానికే సవాలుగా నిలచిన సాహసోపేతమైన రచనలు.

## జన్మస్థలం—

పంజాబ్ రాష్ట్రంలోని పర్వత ప్రాంతమైన "కాంగడా" జిల్లా గ్రామవాసియైన సామాన్య వ్యాపారి కుమారుడు యశపాల్. పుట్టింది మాత్రం ఫిరోజ్‌పూర్

ఛావనీలో 3-12-1903 నాడు. తల్లి ప్రేమదేవి అక్కడి ఆర్యసమాజ అనాథ పాఠశాలలో అధ్యాపకురాలిగా పనిచేస్తుండేది.

తండ్రి హీరాలాల్ ఖత్రీ చిల్లర మొల్లర వ్యాపారం చేస్తుండేవాడు. దానితో వచ్చే ఆదాయం కుటుంబ పోషణకు సరిపడేది కాదు. ఉన్న కొంత డబ్బు వడ్డీ ఆశకు పరులకిచ్చేవాడు. పుచ్చుకున్నవాళ్ళు అతని అమాయకత్వాన్ని ఆసరా చేసుకొని అసలుకే ఎగనామం పెట్టేవారు. ప్రేమదేవికి భర్త వ్యవహారం నచ్చేదికాదు. అతడు ఆమె మాట వినేవాడు కాదు. ఆమె గౌరవనీయమైన కుటుంబం నుంచి వచ్చిన స్త్రీ. భర్త ఆశ వదలి తన కాళ్ళపై తాను నిలబడి భవిష్యత్తును రూపొందించుకోవాలనే సంకల్పంతో ఫిరోజ్‌పూర్ వచ్చింది. అంతవరకే తమ ఊరివాళ్ళు కొందరు వచ్చి అక్కడ ఉండటం ఆమెకు ధైర్యాన్నిచ్చింది. అవి ఆర్యసమాజం ప్రచారం పొందుతున్న రోజులు. ఆమెకు ఆర్య సమాజమంటే అభిమానం. అందుచేత ఆ సమాజం వారి సహకారమూ ఆమెకు లభించింది. యశపాల్ తర్వాత ధర్మపాల్ కలిగాడు. ఇద్దరు కొడుకులనూ తన సంపాదనతో పోషించుకోసాగింది. తల్లి రక్షణలోనే పెరిగిన యశపాల్‌తో తండ్రికంటే ఆమె అంటేనే అభిమానం.

తల్లి నుండి ఆయనకు లభించింది అంతులేని అభిమానం. దేశభక్తి లభించినా అది వింత మలుపుల తిరిగింది.

## బాల్యం —

ఎనిమిదేండ్లు వచ్చేసరికి కాంగడా గురుకుల పాఠశాలకు విద్యాభ్యాసానికి పంపించింది తల్లి కొడుకును. అక్కడి నియమాలు కఠోరంగా ఉండేవి. ఏ కాలమనక మసకతోనే ఉదయానలేచి చన్నీటి స్నానం చేసి ప్రార్థనలో పాల్గొనాలి.

హాస్టల్ భోజన వసతి ఉండేది. పేదపిల్లల జాబితాలో చేర్చి అతనికి ఫీసు ఉండేది కాదు. కాని ధనవంతుల పిల్లలకంటే ఎడమ దృష్టితో చూడబడడం వల్ల తమ పేద తనముపై కోపం వచ్చేది.



అక్కడ వైదిక అభిమానంతో విద్యాభ్యాసం జరిగేది. స్త్రీలను కంటపడ నిచ్చేవారు కాదు. పాఠ్యాంశాల ఎంపిక బోధన కూడా గమ్మత్తుగా ఉండేది. భారత దేశం ప్రపంచంలోనే గొప్ప విజ్ఞానం కల దేశమని, మనది అతి పురాతనమైన అమూల్య నాగరికత అని బోధించేవారు.

అక్కడ చదివే పిల్లలు తాము పెరిగిన తర్వాత ఆంగ్లేయులను దేశంనుంచి

తన్ని తరిమేయగలమని, ఇంకా ఇంగ్లాండునే జయించగలమని కలలు కనేవారు. మన ప్రతిభపై వారికంతటి విశ్వాసం. అంతా అదో రకం వాతావరణం. కొడుకు ఆర్యమత ప్రచారకుడు కావాలని ప్రేమదేవి కోరిక. అతన్ని లాయర్‌ను చేయాలని ఉండేది.

అక్కడి విద్యార్థి జీవితంలోనే బంకింబాబు "ఆనంద మఠం" నవల చదివాడు యశపాల్. 1905 బెంగాళ్ విభజన తర్వాత లేచిన సన్యాసుల తిరుగుబాటు కథ. "వందేమాతరం" గీతం అందులోదే.

"అండమాన్ ప్రతి ధ్వని" అనే జైలు జీవిత చిత్రణనూ చదివాడు. ఆ కాలంలోనే 1919 (రౌలత్ చట్టం కాలం) "అంగూఠీ" అనే పేర ఒక కథ వ్రాస్తే ఒక లిఖిత పత్రికలో అచ్చయిందది.

## లాహోరులో విద్యాభ్యాసం

14వ ఏట లాహోరులోని డి. ఎ. వి. (దయానంద్ ఆంగ్లో వైదిక్) స్కూల్లో చేరాడు. పంజరం నుంచి తప్పుకున్న పక్షిలా తోచింది. అక్కడ గురుకులంలోవలె ప్రభుత్వ వ్యతిరేక చర్యలు, కఠిన నియమాలూ అంతగా ఉండేవి కావు. ఇక్కడున్నది కొద్ది కాలమే. తిరిగి తల్లి దగ్గరికి ఫిరోజ్‌పూర్‌కే వెళ్ళాడు. ఆర్యకన్యా ప్రాథమిక పాఠశాలలో అధ్యాపకురాలుగా ఉందామె. యశపాల్ చాంవనీ ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలో చేరాడు.

లజవంత్‌రాయ్ అనే విద్యార్థితో స్నేహం కలిసిందక్కడ. యశపాల్ 7వ తరగతిలో ఉన్నప్పుడు అతడు పదవ క్లాసు. రాయ్ ఆర్యసమాజ అభిమాని. ఇతడూ అతనితోపాటుగా ఆ సమావేశాలకు వెళ్ళేవాడు. అతని దగ్గరే బంకిం, రవీంద్ర, శరత్‌బాబు ప్రేమ్‌చంద్ రచనలు చదివాడు.

ఏడవ తరగతిలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడై తల్లికి ఆనందం కూర్చాడు. ఆ తల్లి సాహసురాలు. పిల్లలను విద్యావంతులను దేశభక్తులను చేయాలనే కోరిక కలది. ధర్మపాల్ రెండవ తరగతిలో చేరాడు.

కష్టాలు మనుషులను వయసుకు మించిన ఆలోచనా పరులను చేస్తాయి. యశపాల్ తల్లికి ఇంటి పనుల్లో సహకరించే వాడు. తమకోసం శ్రమిస్తున్న తల్లికి పనిభారం తగ్గించాలని ఇంటి పనుల్లో తోడ్పడేవాడు. నెలకు 30 రూ॥ వేతనంతో ఆమె గుట్టుగా చక్కగానే కుటుంబాన్ని గడుపుతున్నది.

అయినా ఆమెకు ఆర్థికంగా తోడ్పడాలని యశపాల్ తొమ్మిదవ తరగతి చదువుతూనే రెండు మైళ్ళ దూరంలోని ఒక రాత్రి పాఠశాలలో ఎనిమిది రూపాయల నెల జీతంతో ఉపాధ్యాయుడుగా చేరాడు. ఎంత మురిసిందో ఆ తల్లి కొడుకు ప్రయోజకత్వానికి.

## గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమంలో

ఏడాదిలో తప్పక స్వతంత్రం తెస్తానని గాంధీజీ ప్రజలను సత్యాగ్రహంలో దింపిన రోజులవి. శాంతి అహింస ఇంకా రంగప్రవేశం చేయలేదు. నిరసన ప్రదర్శనలు పలురకాలుగా సాగేవి. విదేశీ వస్తు బహిష్కరణ, ఖద్దరు ధారణ వాటిలో ముఖ్యమైనవి.

అప్పుడు విద్యార్థులు చదువు వదలి, ఉద్యోగులు పనులు వదలి జాతీయ సత్యాగ్రహోద్యమంలో ముమ్మరంగా పాల్గొన్నారు.

యశపాల్ వాళ్ళుండే కంటోన్మెంట్ పట్టణానికి మూడుమైళ్ళ దూరము. ఆంగ్లవాతావరణం కాబట్టి బయట రాజకీయ అలజడి అక్కడ లేకుండేది. ఏదో

ఒకటి చేయాలనే లజపతిరాయ్ ప్రేరణతో విదేశీ దుస్తులు తగలపెట్టాలనే యోచన యశపాల్‌కు కలిగింది. అప్పుడు వాళ్ళిద్దరూ మనోహర్‌లాల్ హైస్కూల్లో ఒకే తరగతిలో ఉన్నారు. పంజాబులో స్త్రీలు ఇంటింటా రాట్నాలు వడుకుతున్నారు. ఆంధ్ర దేశంలోనూ "పాడవే రాట్నమా ప్రణవ భారతగీత" రాగాలు



తీస్తున్నారు. యశపాల్ తల్లి రోజూ రాట్నం వడికేది. అందుకోసము ఏకులు కొనితెచ్చేవారు కాదు. పాత రజాయి (సన్నటి పరుపులాంటి దుప్పటి, ఉత్తర భారతములో సర్వసామాన్యం. దక్షిణ భారతదేశంలోనూ ముస్లింలు కొందరు వాడతారు) కొందరుకొన్ని దూదితోనే దారం తీసేది. దానితో నేసిన ఒక జత బట్టలు కుట్టించుకున్నాడు యశపాల్.

విదేశీ బట్ట తగలబెట్టడానికి తల్లిని సిల్కుచీర అడిగితే ఇవ్వలేదు. ఆమెకు అదొక్కటే విలువైన చీర. పైగా అందుకు కొన్ని రోజులు ముందు తెల్లటి బట్టలతో తిరగడం చూశారామో వాళ్ళింట దొంగలుపడి డబ్బు కనిపించక బట్టలు బోళ్ళు ఎత్తుకు వెళ్ళారు. తన కోటును, తెచ్చాడు యశపాల్. మూడో నాలుగో రాయ్ తెచ్చాడు. అన్నీ మాత్రం పదివరకు ప్రోగుచేసి పళ్ళెంపై కర్రతో మోగిస్తూ చాటింపుచేసి "ర్యాలీలా మైదానం"లో పదిమందిని చూడగా వాటిని కాల్చి ఘాటుగా తెలిసీ తెలవని ప్రసంగాలు చేశారు. అదే అతని మొదటి సాహసిక చర్య. అక్కడికే పోలీసులు అరెస్టు చేస్తారేమోననిభయపడుతూ తప్పించుకు తిరిగాడు.

తర్వాత కొన్ని బహిరంగ సభలు నిర్వహించాడు. దేశభక్తుల యువకుల జట్టు ఒకటి తయారైంది కంటోన్మెంటులో గాంధి, లాలాజీ, వల్లభబాయి మొ॥ దేశనాయకుల మాటలే మిత్రులు తమ ఉపన్యాసాల్లో తిరగేసేవారు. తాను మాత్రం "దేశదర్శనే" చదివాడూ గనుక భారతదేశం వస్తూత్వతో ఎలాగుంది. ఆంగ్లేయుల దోపిడీ ఎంతగా సాగుతున్నది, అంకెల వివరాలత్తో చెప్పేవాడు. అతని ప్రసంగాలే రక్తిగా ఉండేవి.

అదేకాలంలో పాఠశాల అలంకరణకు సూక్తులు వ్రాసుకొని తెమ్మన్నారు అధ్యాపకులు, **God Save the king**, ఆరోగ్యమే మహాభాగ్యం, వంటివి ఇతరులు వ్రాసి తెస్తే- యశపాల్ "జననీ జన్మ" భూమిశ్చ స్వర్గాదపీ గరియసీ, అని వ్రాసి తీసుకెళ్ళి వాటిని ఆశ్చర్యంలో ముంచాడు.

1921 డిసెంబర్ 31 నాటికి స్వరాజ్యం రాలేదుసరికదా "చౌరాచౌరి"లో ఆంగ్లసిపాయిలను భారతీయులు హింసించారని ఉద్యమాన్ని నిలిపివేసి, ఉప

వాస వ్రతాన్ని ఆరంభించాడు. మహాత్ముడు హింసకు ప్రాయశ్చిత్తంగా కాంగ్రెసు ఉద్యమకారుల ఉత్సాహం చప్పబడింది. కొందరు తిరిగి ఇళ్ళకు చేరితే కొందరు ఖద్దరు ధారణ, మద్యపాన నిషేధం వంటి సొంత పనుల్లో ప్రజా హిత కార్యక్రమాలకు పూనుకొన్నారు. యశపాల్ కాంగ్రెసు ప్రచారానికి పూనుకొని పండితతోతారం, మహ్మద్‌దీన్ మిరాసీలతో కలిసి గ్రామాలకు వెళ్ళే వాడు. తోతారాం చక్కగా పాడేవాడు. భారత రామాయణ గాథల్లో దేశభక్తి జోడించి తెలిపేవాడు. దాని ముందు యశపాల్‌కు అంకెల గారడీ ప్రసంగము చప్పగా ఉండేది. గ్రామీణులకు ఇక దీన్‌మిరాసీ ప్రసంగాన్ని గురించి చెప్పేదేలేదు. ఆయన హాస్యప్రియుడు. ఇండియా వాళ్ళు ఒకసారి మూత్రం పోస్తే ఇంగ్లాండు కొట్టుకు పోతుందనే వాడు. జనం గొల్లున నవ్వేవారు. మొరటు హాస్యం ఆ గ్రామీణులకు బాగానచ్చేది.

ఈ ప్రచార కార్యక్రమాల్లోనూ విసుగు జనించింది యశపాల్‌కు.

## పంజాబ్ నేషనల్ కాలేజీలో-

స్థానికంగా తెరచిన కొత్త కాలేజీలో కొడుకు చదివితే ఉపకార వేతనం లభిస్తుందని ప్రేమదేవి ఆశ. కాంగ్రెసు ఉద్యమంలో చేరటం మూలాన ఆ కాలపు అనేకులకి వలె యశపాల్‌కు చదువుమీద విముఖత ఏర్పడింది. మొదట చదువుకోనని మొండికి వేసినా తల్లి బతిమిలాడటంతో జాతీయ కళా శాలలోనైతే చేరుతానన్నాడు. అక్కడ చదివితే డిగ్రీలైతే వస్తాయి కాని అవి ఉద్యోగాలకు పనికిరావు, విధిలేక సరేనందామె.

యశపాల్ పంజాబ్ నేషనల్ కాలేజీలో చేరాడు. లాహోరులో మకాం

పెట్టాడు. అక్కడే అతనికి భగత్‌సింగ్, సుఖదేవ్, అతని వరుస సోదరుడు జయదేవ్, ఇంకా భగవతీ చరణ్ మొ॥ వారితో స్నేహం కలిసింది.

భగవతీ చరణ్ గుజరాతీ బ్రాహ్మడైనా అచ్చం పంజాబీ లాగానే ఉండేవాడు. ఆజాను బాహుడు, బాల్యంలోనే పెళ్ళయింది. దేశభక్తుడు లాహోరు నివాసి.

అక్కడ ఏ భావాన్నీ ఆచారాన్నీ బలవంతంగా రుద్దే వారు కాదు. ఖద్దరు ధరించడం ప్రార్థనలో పాల్గొనటం తప్పని సరికాదు. పాఠ్యబోధన మాత్రం దేశభక్తిని కలిగించేది. ఈ జాతీయ కళాశాలలను స్థాపించిన ఉద్దేశ్యమే అది. పంజాబ్ నేషనల్ కాలేజీ ఆరంభించింది పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్, భాయ్ పరమానంద్ (ఒకనాటి విప్లవ కారుడు) నిర్వహణ. ఆయన సాదాసీద మనిషి. ఆడంబరాలు నచ్చేవికావు. యశపాల్ ఆయన నిరసనకు గురయ్యాడు. నీట్‌గా ఇస్త్రీ మడుపులు ధరిస్తూ.

హాస్టల్ వసతి ఉన్నా వేరుగానే ఉంటున్నారు వీళ్ళు. కాలేజీ ప్రొఫెసర్లను కొందరిని వారి ప్రత్యేక బోధనా వైఖరులను బట్టి ఆటపట్టించేవారు-యశపాల్, భగత్ మిత్రులు. రోహతక్ పిల్లలు బుద్ధిమంతులు. వారు దేశభక్తులౌతారని పొగడ్తలు పొందినా ఆ తర్వాత చక్కని సంసారులైనారు. వీరు ఎందుకూ పనికిరారని దీవెనలు పొందినా క్రాంతికారులై త్యాగగుణంతో రాణించారు.

పెద్దల జోస్యం అంతటా చెల్లుతుందనే గ్యారంటీ ఏముంది ?

కాలేజీ గ్రంథాలయంలోనే కాక, లాలాజీ తండ్రి పేర స్థాపించిన ద్వారకానాథ పుస్తక నిలయంలోనూ అనేక అమూల్య గ్రంథాలను చదివారు. వాటిలో, డేన్‌బ్రీన్ "ఐరిష్ స్వాతంత్ర్యం కోసం నా పోరాటం", వాల్తేర్ "ఫ్రెంచి విప్లవ

చరిత్ర" మెజినీ, గైరిబాల్డీ, రూసో రచనలు, ఇంకా భారత విప్లవకారుల చరిత్రలు, సన్యాల్ దాదా "బందీ జీవన్"- "రౌలత్ కమిటీ రిపోర్టు" ముఖ్యమైనవి. వాటితో వారి ఆలోచనలు పదునెక్కినవి.

అక్కడే పాఠాలను క్రొత్త రకంగా వినే అవకాశం లభించింది. ప్రొఫెసర్ (లెక్చరర్ లెండి) జయచంద్ర విద్యాలంకార్ బోధన నవ్యవిధానంలో ఉండేది. భౌతికవాదం, నాస్తికం, తర్కం మొ॥ విషయాలు చక్కగా వివరించేవాడు. విద్యార్థుల్లో చారిత్రక విజ్ఞానం పెంచి, విప్లవకాంక్ష రగిలించాడు.

ఇది 1925 విషయం. 1915లోనే పంజాబ్‌లో గదర్‌వీరుల మొదటి లాహోరు కుట్ర ముగిసింది. 1917 రష్యా విప్లవ విజయం తర్వాత కొందరు పంజాబ్ యువకులు ఆ దేశానికి వెళ్ళి విప్లవ సాహిత్యాన్ని తెచ్చి పంచారు. 1919 రౌలత్ కమిటీ వ్యతిరేకత ఆ రాష్ట్రంలో తీవ్రంగా కనిపించింది. అప్పుడు "అమృతసర్" జలియన్ వాలాబాగ్‌లా నిరాయుధులైన ప్రజలపై బ్రిటిష్ ప్రభుత్వాధికారులు జరిపిన హింసాకాండ మరపున పడలేదు. ఆ ఆవేశం- ఆంగ్ల ద్వేషం ప్రజల గుండెల్లో రగులుతూనే ఉంది. గాంధీజీ శాంతి అంటున్నా ప్రజలు- కాంగ్రెసు వాళ్ళలోనూ ఎందరో అందుకు పూర్ణ అంగీకారంలో లేరు. కాంగ్రెసు ఉద్యమం ఆగినా అందులో పాల్గొన్న వారందరూ అస్త్ర సన్యాసం చేయలేదు.

## ఆంగ్ల ద్వేష బీజాలు —

యశపాల్‌కు ఆంగ్లద్వేషం అప్పటికే ఉండేది. అందుకు బాల్యంలోని రెండు మూడు సంఘటనలు కారణం అనుకోవచ్చు.

ఆయన అయిదారేళ్ళ వయస్సులో ఒకమారు ఉత్తరప్రదేశ్‌లోని బంధువు

ఇంటికి వెళ్ళాడు. వీరాగిన ఇంటికి ప్రక్కగా ఆంగ్లేయ ఉద్యోగులు గృహాలున్నవి కొన్ని, ఒకింటి కోళ్ళు బయట తిరుగుతుండగా పిల్లవాని చేష్టలతో వాటిని రాళ్ళతో కొట్టాడు. అది చూసి ఆ ఆంగ్లవనిత తిట్టింది- చేయెత్తింది.ఇతడూ అంతే చేశాడు. ఆమె నోరు నెత్తిని పెట్టుకునేసరికి ఈ పిల్లవాడు పారిపోయి ఇంట్లో దాక్కున్నాడు. ఆనాడు చుట్టాల తిట్లూ, తల్లి దెబ్బలు భరించవల్సి వచ్చింది. బాధపడ్డాడు పెద్ద నేరస్థునిలా.



ఇంకో మారు క్రొత్తగా అక్షరాలు దిద్దుతున్న దినాల్లో నైనిటాల్ బడికి

వెళ్ళేవాడు యశపాల్. ద్రోణ సాగర్‌తో కొందరు స్త్రీలు ఏకాంతంగా పగటి వేళ స్నానం చేస్తున్నారు. అకస్మాత్తుగా అనుకోకుండా అటువైపు ఇద్దరు తెల్ల సిపాయిలు వచ్చారు. అది చూసి పులులను చూసిన జింకల్లా బెదరి ఆ స్త్రీలు ఆదర బాదరగా తమ బట్టలైనా తీసుకోకుండా పరుగందుకున్నారు.

ఆంగ్లేయులంటే ప్రజలకున్న భయం ఇట్లా తెలిసిపోయిందతనికి. వాళ్ళు ఈ దేశంలో పరాయివాళ్ళుగా లేరు. అధికార గర్వంతో ఉన్నారు. దౌర్జన్యాలు చేయగలరు. తలచుకుంటే కోర్టులకు లాగి నిర్దోషులను దోషులుగా నిరూపించి కఠిన శిక్షల పాలు చేయగలరు.

అందుకే ఆంగ్లేయుల యెడ అంతరంగాల్లో ద్వేషం దేశీయులకు.

1910 ప్రాంతంలోనే పరిష్యన్ వనిత బొంబాయి వాస్తవ్యురాలు "మేడమ్ కామా" జర్మనీ ఫ్రాన్సుల్లో ఉంటూ విప్లవ కార్యక్రమాలు నడిపిస్తూ "వందేమాతరం" పత్రిక నడిపించింది. అందులో "ఆంగ్లేయులను చిన్నా పెద్ద ఆడ మగ అనే భేదంలేకుండా కనిపించిన వారినెల్లా తన్నండి- కాల్చిపడెయ్యండి" అని ఉద్బోధించింది.

అప్పటి పరిస్థితిని వివరిస్తూ బెంగాళీ విప్లవకారుడు భూపేంద్రనాథ దత్తు ఇలా వ్రాసాడు "దాదాపు యాభై సంవత్సరాల క్రింద వంగదేశీయులైన యువకులు ఇంగ్లీషు వారిని ఘోరంగా ద్వేషించేవారు. ఆ రోజుల్లో కలకత్తాలో ట్రాంబండ్లను గుర్రాల్తో లాగించేవారు. ఆంగ్లేయులు ట్రాంబడ్లలో ప్రయాణం చేస్తూ కనిపిస్తే చాలు, దారినపోయే బెంగాళీ యువకులు, విపరీతమైన ద్వేషంతో ఆ బండ్లలో చొచ్చి వారిని చిత్తుగా తన్ని పారిపోయేవారు. ఆ ద్వేషమే సాయుధ

పోరాట విప్లవ రూపం ధరించింది." ఇది వారి రాజధాని కలకత్తా నుంచి ఢిల్లీకి మారకముందు (1911కు పూర్వం) సంగతి.

ఆ రోజుల్లో వారెలా ప్రవర్తించేవారో పై ప్రదేశాల్లోని వృద్ధులనడిగి తెలుసుకోవచ్చును. అప్పట్లో భారతీయుడు ఎవడూ ఇంగ్లీషు వారికి ఎదురుగా గొడుగు వేసుకొని వెళ్ళటానికి వీల్లేదు. (నైజాంకాలంలో పల్లెల్లో దొరలముందూ పెద్దవాళ్లు చెప్పులు వేసుకొని నడిచేవారు కాదు.) పై ప్రదేశాల్లో కొన్ని రోడ్లు ఇంగ్లీషువారికే ప్రత్యేకించబడి ఉండేవి. ఆ రోడ్లపైన భారతీయులు నడవటానికి వీల్లేదు. ఇలాంటివే ఇంకానూ..."

వాళ్ళ సుఖజీవనానికి ఈర్ష్య, తమ అవమానాలకు క్రోధం కలగడం సహజం. ఆ ఈర్ష్య కోపంగానూ కోపం కసిగానూ మారి దౌర్జన్యాలకు దింపేవి.

## పంజాబ్ నౌజవాన్ భారత్ సభ—

కాలేజీలో చదివే కాలంలోనే భగత్‌సింగ్ భగవతీ, చరణ్ ప్రేరణలో లాహోర్‌లో, "నౌజవాన్ భారతసభ"ను ఏర్పాటు చేసాడు. యశపాల్, సుఖదేవ్ మొ॥వారంతా సభ్యులు. ఇంతవరకు భారతదేశంలో ఏర్పడిన ఏ పోరాట సమితికానీ దైవ భక్తి కలదే. 1925లో కాకోరి రైలుదోపిడీ జరిపిన "హిందూస్థాన్ ప్రజాతంత్ర సమితి" HRAలో రాంప్రసాద్ బిస్మిల్ గీతాభక్తుడైతే, అష్ఫాకుల్లా ఖురాన్ భక్తుడు. బెంగాళ్ అను శీలన సమితి బంకింబాబు "ఆనంద మఠం"తో ప్రేరణ పొందిందే. వారి ప్రతిజ్ఞ ఇలాఉండేదని "నా.వి.కాకత్ కర్" స్వతంత్ర సమర జ్వాలలు"లో పేర్కొన్నాడు. ఆ ప్రతిజ్ఞాస్వీకార కార్యక్రమం ఎంతో ఉగ్రంగా గంభీరంగా ఉండేది. కాళీమాత యెదుని, యజ్ఞము,

పూజ చేసి, మోకరిల్లి, తలమీద కత్తి, భగవద్గీత ఉంచుకొని ప్రతిజ్ఞ ఉచ్చరించాలి. దృఢంగా, స్థిరంగా, గంభీరంగా తీసుకునే ఈ దేశసేవా ప్రతిజ్ఞ మహావిగ్రహమైనది. తాము ఈ ప్రతిజ్ఞను పాలించకపోతే బ్రాహ్మణుల, మాతాపితల, దేశము లోని సమస్త దేశభక్తుల శాపంచేత దగ్ధమై, భస్మమై పోదుము గాక అని చెప్పి "వందేమాతరం" అని భారత మాతకు జేజేలు పలికేవారు.



1915 గదర్ వీరుల మతంకంటే దేశభక్తికే విలువిచ్చారు. కాంగ్రెసు పార్టీఅయితే మతాలకన్నింటికీ విలువిచ్చింది. మత సామరస్యము బోధించినా గాంధీజీ కాలంలో మతాల అభిమానం అధికమైంది. అదే హిందూ ముస్లింల దేశవిభజనకు కారణమైంది. ఇప్పుడు సిక్కుల మత దురభిమానం పెరిగి పోతున్నది. మతములకు విలువనీయనినాడే మానవత్వానికి విలువిచ్చిననాడే సమతా భావం నెలకొంటుంది.

కులమతాల నిరసన నౌ.భా.స. ప్రధాన ధ్యేయం. జాతి సమైక్యత

బోధిస్తూ, దేశ స్వాతంత్ర్యానికి శాంతి సత్యాగ్రహాలులేక సాయుధ పోరాటమే శరణ్యమని ప్రచారం చేసేవారు. అన్ని మతాల మూఢ ధర్మాలను నిరసిస్తూ అవి హేతుబద్ధాలు కావని నిరూపించేవారు. కులమత విభేదం పాటించకుండా సహాపంక్తి భోజనాలు నిర్వహించేవారు.

గదర్ వీరుల్లో, దేశభక్తితో ధ్యేయంగా వీర సందేశమిచ్చి 18 ఏళ్ళ వయస్సులో ఒకడి చిరునవ్వుతో ఉరిశిక్ష ననుభవించిన కర్తార్‌సింగ్ శరభ జయంత్యుత్సవం ఘనంగా నిర్వహించి నౌ.భా.సభ తన ప్రత్యేకతనుచాటుకున్నది. ఆ సభలో భగవతీ చరణ్ భార్య దుర్గాదేవి. సోదర సంశీల చిత్రపటాన్ని తమ బొటనవేళ్ళు చీల్చుకొని రక్తాభిషేకం చేశారు. సభ్యులు వీర ప్రసంగాలు చేశారు. అందులో క్రియాశీల కార్యకర్త యశపాలు మతనిరసనకు సాయుధపోరాటానికి నాందిపలికిందినౌ. భా.సభ.

ముస్లింలు, సిఖ్కు, హిందూ యువకులు అందులో పాల్గొనేవారు. ప్రభుత్వ వ్యతిరేకత కలది కాబట్టి క్రైస్తవులు చేరేవారు కాదు. వీరిని ఎదిరించిన మత పెద్దలను గట్టిగా ఎదిరించేవారు. యువశక్తిముందు ఏది ఎదురు నిలుస్తుంది.

ఆ దశలోనే HRA కరపత్రాలు రహస్యంగా ప్రజలకు పంచారు. అజాద్ చంద్రశేఖర్ HRA కార్యకర్త.

## భగత్‌సింగ్ స్నేహం—

యశపాల్‌కు నేషనల్ కాలేజీలోనే భగత్‌సింగ్ స్నేహం ఏర్పడింది. ఉండేది వారింటిలోనే. అతనితో వాళ్ళ స్వగ్రామానికి వెళ్ళాడు. అతని తల్లి విద్యాదేవి ప్రేమతో పెట్టిన భోజనం తిన్నాడు. రొట్టె, పప్పు, కూర, నెయ్యి

పుష్టిగా తినేకొడుకును ఆమె "తిండి సరిగా తినక చిక్కిపోతున్నాడు" అనిఅంటే, అతనితో తన బక్క పలుచని దేహాన్ని పోల్చుకొని సిగ్గుపడ్డాడు. ఇద్దరూ ఒకరి రచనలు ఒకరు చదివేవారు. యశపాల్ హిందీలోనే వ్రాస్తేభగత్‌సింగ్ ఉర్దూరెంటిలో వ్రాసేవాడు. ఆంగ్లంలో ఇతడే కుడి. భగత్ సంస్కృత విద్యార్థి.

భగత్, సుఖదేవ్ ఇతని కంటే విప్లవ కార్యాల్లో ఎక్కువగా పాల్గొనే వారు. అప్పుడు యశపాల్ అభిప్రాయం ఇది.

"నేను విప్లవకార్యాల్లో క్రియాత్మకంగా పాల్గొనేకంటే దూరంగాఉండి నా రచనలద్వారా విప్లవానికి అనువైన వాతావరణాన్ని కల్పించడం మంచిదేమో నన్న భావన అప్పటికే నాలో వుంది. ఈ భావన నాలోని ఒకరకమైన అహం కారమే కావచ్చు. మా కుటుంబం పట్ల నాకుగల కర్తవ్యాన్ని పూర్తి చేయాలనే భావనా ఉంది. కొంతలోకొంత విప్లవ కార్యక్రమాల్లో క్రియాత్మకంగా బాధలు భరించలేని పిరికితనం, సోమరితనమూ ఉన్నాయి."

ఒకనాడు జయచంద్ర విద్యాలంకార్ "ఈ చదువుల వల్ల ప్రభుత్వ ఉద్యోగమైతే రాదుకదా. భవిష్యత్తులో ఏం చేయాలని నీ ఉద్దేశ్యం" అని యశపాల్ నడిగాడు.

"పొట్టకోసం పర ప్రభుత్వానికి ఎన్నడూ సహకరించను. నా జన్మభూమిలో విదేశీ ప్రభుత్వాన్ని ఏనాడూ సహించను" అన్నాడు.

"దేశవిముక్తికి ఏ మార్గాన్ని అనుసరించాలనుకుంటున్నావు" అతడు తిరిగి అడిగాడు.

"ఇప్పటికీ ఒక నిర్ణయానికి రాలేదు, ఏం చేసేదీ ఇప్పుడు చెప్పలేదు. దేశం కోసం నేను ఏమైనా చెయ్యవచ్చు- ఏమీ చెయ్యలేకనూ పోవచ్చు" అనితప్పుకున్నాడు యశపాల్.

నూరు చెప్పటం కంటె ఒకటిచేసి చూపటం మంచిదనే భావంఅతంది. విప్లవ భావాలను ప్రచారం చేసుకోవడం ప్రమాదకరమని తెల్సు. ప్రభుత్వము నిఘా ఉంది ఆ విధంగా.

ఒకసారి భగత్‌సింగ్, యశపాల్ కలిసి రావీనదిలో నావనడుపుతూ కబుర్లలో పడ్డారు.



"దేశం కోసం మన ప్రాణాలను త్యాగం చేయాలి" ఇతడే అన్నాడు దృఢంగా. కొద్దిపాటి విరామం తర్వాత భగత్‌సింగ్ "అవును- అందుకు నేనూ ప్రతిజ్ఞ చేస్తున్నాను-" అని మిత్రుని చేతిలో చేయి వేసాడు. అప్పుడు భగత్ వయస్సు పద్దెనిమిది, యశపాల్‌కు ఇరవై రెండు.

## అలజడి దశ—

1926లో నౌజవాన్ భారత సభ నాయకత్వం జయచంద్ర చేతిలో పడింది. అతని క్రియాశూన్య డాంబిక వీరధర్మ ప్రచారాలతో సభ్యులు విసుగెత్తి పోయారు. సభలు నిర్వహించడం తప్ప సంస్థ నిర్వహించిన ప్రత్యేక ప్రభుత్వ వ్యతిరేక చర్య ఏదీలేదు. ఇతర ప్రాంతాల విప్లవ సంఘాలు ప్రభుత్వాన్ని ఎదిరించే పనులు చేస్తూ ప్రజల దృష్టిని ఆకర్షించుతూ మంచి ప్రచారము పొందుతున్నవి.

"చెయ్యడు." చెయ్యనివ్వడు. ఇదేం విధానం. ఆయన ప్రక్కకు తప్పుకుంటే యేమైనా మాకు తోచిందేమైనా చేస్తాం" అని భగవతీ చరణ్ బాహాటముగానే అన్నాడు. దానితో అరికాలిమంట తలకెక్కింది జయచంద్రకు. సంస్థలో అనేకులు తన విద్యార్థులే. తానే విప్లవ పాఠాలు బోధించాడు. తననే ఎదిరిస్తారా? అనేది అతని కోపానికి కారణం. స్వారి గుర్రానికి తిరుగుడు రోగమనీ అతనికీ కొన్ని బలహీనతలున్నవి. వీరభావాల్తో ఉన్న విప్లవంచని పిరికి తనముంది. అది ఒప్పుకోదు. శేషం కోపేన పూరయేత్ అని "భగవతీ చరణ్ ప్రభుత్వ గూఢచారి అతన్ని నమ్మకండి. తప్పుకొని మెదలండి" అతనిదుష్ప్రచారాన్ని ఆరంభించాడు.

సంస్థను ఆరంభించింది భగవతీభాయి. ఆయన ప్రచార కార్యదర్శిగా ఉంటూ భగత్‌సింగ్‌ను ప్రధాన కార్యదర్శిని చేశాడు మొదట. సంస్థకు ప్రధాన ఆర్థిక సహాయకుడాయన. అతనిపైనే అనుమానం రావటంతో సభ్యులు అలజడి చెందారు.

భగత్‌కు భగవతీ చరణ్ అంటే అభిమానం. యశపాల్‌కు డెహరాడూన్ హిందీ సభల్లో కలిశాడు చరణ్ మొదట. క్రమంగా వారి స్నేహం గాఢమయింది.

దుర్గాదేవి యశపాల్ ఒకేసారి హిందీ ప్రభాకర్ పరీక్ష వ్రాసారు. ఈ సంస్థ స్తబ్దతకు విసిగి ఉద్యోగ ప్రయత్నాలతో తిరుగుతుండడం వల్ల, తమతో వేరుగా ఉంటున్నట్లునూ, రచనా ప్రీతితో ఏకాంతంలో కూర్చుని కవితలు వ్రాసుకోవడం వల్ల తమపై ప్రభుత్వానికి రిపోర్టులు వ్రాసి పంపుతున్నాడేమోననే అనుమానం సంస్థ మిత్రులకూ కలిగింది.

భగత్, సుఖదేవ్ ఈ విషయంలో యశపాల్ గట్టిగా వాదించారు. అతనికేమీ తోచకుండా ఉంది.



భగత్‌సింగ్‌కు ఇంట్లో పెళ్ళి ఒత్తిడి అధికమైంది. ఇటు సంస్థ కార్యకలాపాలు సంతృప్తిగా లేవు. ఢిల్లీకి పరారై "అర్జున్" పత్రికా కార్యాలయంలో చేరాడు. అక్కడ నుంచి ఉత్తరాలతో సంప్రదించి కాన్పూర్‌లో గణేశశంకర

విద్యార్థి నడిపే "ప్రతాప్" పత్రికాఫీసులో చేరాడు. విప్లవకారులతో సంబంధాలు పెంచుకోవడం మరచిపోలేదు. అక్కడే ఆజాద్ చంద్రశేఖర్, బటుకేశ్వర దత్తులతో పరిచయమైంది.

ఆజాద్ "కాకోరి కుట్ర" ఖైదీలను విడిపించే యత్నంలో ఉన్నాడు. భగత్ అతనికి తన మద్దతు ప్రకటించాడు.

ఈ కాలంలో సుఖదేవ్ పంతంవల్ల యశపాల్ సంస్థకు జయగోపాల్ అనే విద్యార్థిని జతచేశాడు.

ఒకనాడు భగత్‌సింగ్ వచ్చి పిస్తోలు చూపుతూ భగవతీ చరణ్‌ను కాలుస్తానని చెప్పాడు. అతని విషయంలో నిజమేమిటో తెలుసుకోవాలని పట్టుపట్టాడు. మిత్రునిలోని ద్రోహబుద్ధిని సహించలేకపోతున్నాడాయన. మరోనాడు సుఖదేవ్ వచ్చి చరణ్ సి.ఐ.డి. అని కాంగ్రెసువాళ్ళు కూడా అంటున్నారు. అదే అయితే అతన్ని కడతీర్చే బాధ్యత నీదే అని అన్నాడు.

యశపాల్, చరణ్ ఇంటికి వెళ్ళాడు. గ్వాల్‌మండీలోని భగవతీ చరణ్ గృహం "శివనివాస్" విప్లవకారులకు విడిది. చరణ్ క్రాంతికారులను ఆదరించి కమ్మటి భోజనాలు పెట్టేవాడు. ఆర్థికంగా విప్లవకార్యాలకు సహకరించేవాడు. అటువంటి వ్యక్తిపై అనుమానం.

సత్యం తెల్సుకోవాలని యశపాల్ వెళ్ళాడు. దుర్గాదేవి మిత్రుని ఆదరించి సర్దీగా ఉందని కషాయాన్ని కాచి తేవటానికి లోపలికి వెళ్ళింది. అప్పుడే ఇల్లంతా వెదకసాగాడు యశపాల్. ఆనాడు భగత్‌సింగ్ ఉపాయంగా భగవతీ చరణ్‌ను విప్లవ కార్యాలను చర్చించే నెపంగా తమ వూరికి తీసుకెళ్ళి ఈ ఇంటి నుంచి తప్పించాడు.

ఎక్కడా ఏ అనుమాన వస్తువుకానీ కాగితంకానీ కనిపించలేదు. లోపలి

గదిలోనూ చూశాడు. అతడు ఏకాంతంగా వ్రాసే కాగితాలు కనిపించాయి. చిక్కు ముడి విప్పబడుతుందని పై పత్రం తీసి చదివాడు.

"తిరుగుబాటు ప్రతి బానిస దేశం యొక్క - ప్రజల యొక్క మొదటి హక్కు" ఇది అందులోని మొదటి వాక్యం. భారత విప్లవ పోరాట చరిత్రను ఆంగ్లంలో వ్రాస్తున్నాడు చరణ్. అంతటి దేశభక్తి చిత్తశుద్ధి కల మిత్రుని అనుమానించినందుకు సిగ్గుపడి వెనుదిరిగి వచ్చాడు యశపాల్.

## ఉద్యోగ జీవితం —

భగత్‌సింగ్ వెళ్ళిపోగానే కిషన్‌సింగ్ గారి ఇన్సూరెన్సు కార్యాలయ గది నుండి బయటికి వచ్చాడు యశపాల్. కొన్నాళ్ళు కాలేజీ హాస్టల్‌లో ఉన్నాడు. బి. ఎ. పూర్తయింది. తర్వాత "హిందూ సంఘటన్" అనే పత్రికాలయంలోనికి మారాడు. ముస్లిం మత ద్వేషంతో ఆ మధ్యే ఆరంభమైన ఉర్దూ హిందూ పత్రిక అది. లాహోర్‌లో హిందీకంటె అధిక వ్యాప్తిలో ఉర్దూ భాష ఉంది. ఉర్దూ మాట్లాడే వాళ్ళందరు ముస్లింలు కారు. ఉర్దూ రాని ముస్లింలు కూడా ఉన్నారు. ఆ కాలంలో ఆంగ్లేయుల పాలనలో ఇంగ్లీషు వలె నవాబుల పాలన కారణంగా ఉర్దూ దేశీయుల్లో మత ప్రమేయం లేకుండా వ్యాప్తిపొందింది. కాంగ్రెసు ఉద్యమం చల్లబడేసరికి, ముస్లింలీగ్ ధోరణి చూసి కొందరు పెద్దల దృష్టి హిందూ మతం దిక్కు మళ్ళింది. 1925లో నాగపూర్‌లో ఆర్.ఎస్.ఎస్. ఉద్యమం ఆరంభమైంది. ఈ హిందూ సంఘటన్ క్రైస్తవులకంటే శత్రువులు ముస్లింలే అనేవారు. ముస్లింలతో మెతకగా వ్యవహరించే కాంగ్రెసును దుయ్యబట్టేవారు.

భాయీ పరమానంద్, కృష్ణదాస్ ఆ పత్రిక నిర్వాహకులు. భారతీయులకు శత్రువులు ఆంగ్లేయులే అని ముస్లింలను వదిలేసేవాడు యశపాల్. తమ ఆదర్శానికి

భిన్నమైనా ఇతని రచనలు ముద్రించేవారు వాళ్ళు. అక్కడ తన రచనలు చేస్తూనే అక్కడికి వచ్చే యువకులకు వ్యాయామం, కర్రసాము నేర్పించే ఉద్యోగంలో చేరాడు యశపాల్.



ఇక్కడే మరో యువ ప్రాయసకాడు శిష్యుడుగా మిత్రుడుగా మారాడు మంగతరాం అనే అతడు తర్వాత ఇతనిపై అభిమానంతో ఇంద్రపాల్‌గా పేరు మార్చుకొని పార్టీకి ఎంతో సహకరించాడు. సాంప్రదాయిక కుటుంబం వాడైనా విచ్చలవిడిగా నడిచే అతని జీవితం యశపాల్ కారణంగా దారిలో పడింది. తన పనికై రావల్పిండి కోసం వెళ్ళినప్పుడు కూడా అక్కడి యువకులను పలువురిని విప్లవ సంస్థకు చేర్చి ఉపకరించాడు.

కొద్దికాలానికే కృష్ణదాసు పత్రికను వదలి సన్యాసాశ్రమం స్వీకరించాడు. వేసవి సెలవులు వచ్చి తల్లి దగ్గరికెళ్ళాడు యశపాల్-

## లాయల్ పూర్‌లో

తాను ఉద్యోగం చేస్తుండగా తల్లి ఉద్యోగం మార్పించాడు. పల్లె గ్రామమైన కాగడాలతో కొడుకు ఇంద్రపాల్ చదువు సాగదని ఆమె లాయల్ పూర్ వెళ్ళి అక్కడ బంధువులతో పాటుగా ఉండసాగింది ప్రేమదేవి.

నిరుద్యోగిగా యశపాల్ కొన్నాళ్ళు అక్కడ గడిపాడు. నేషనల్ స్కూల్ మూతపడి అక్కడ చేరిన తన ఉద్యోగమూ పోయింది.

నిరాశలో గడుపుతున్నా తన విప్లవ కార్య ప్రచారాన్ని మానుకోలేదు. ధర్మవీర్ అనే అభిమాని లభించాడు. ప్రేమవతి అనే మేనకోడలు (వితంతువు) ను విప్లవ అభిమానినిగా మార్చాడు. ఆ మానిన తర్వాత పార్టీ కార్యకర్తలందరికీ "అక్కయ్య"గా మారి ఎంతగానో సహకరించింది.

తిరిగి ప్రేమదేవి ఆర్య కన్యా పాఠశాలలో చేరింది. యశపాల్ సైతం లాహోర్ చేరుకున్నాడు.

## లాహోరులో

కాంగ్రెసు మితవాదంతో సరిపడక 1923లోనే మోతీలాల్ సి.ఆర్. దాస్. "స్వరాజ్య పార్టీ"ని, లాలాజీ, "నేషనల్ పార్టీని స్థాపించారు. అయినా అవి కాంగ్రెసుగానే చలామణి అయ్యేవి. గోపీచంద్ భార్గవ, లాలాజీ అభిమాని, ఆయన (హిందూ) సేవాసమితి, వ్యాయామశాల ఈ రెంటిని నిర్వహించే బాధ్యత యశపాల్ కొప్పగించాడు. ఇంకా మితవాద కాంగ్రెసుకు అభిమాన పాత్రమైన ఇద్దరు భాండార్‌నూ ఆయన నడిపించేవాడు.

లాహోర్‌లో 55 శాతం ముస్లింలే కాబట్టి హిందువులను సంఘటిత పరచి ఉంచడం భార్గవ ధ్యేయంగా పెట్టుకున్నాడు. అందుకో పెద్దయిల్లు ఆఫీసు కొరకు తీసుకొన్నాడు. అక్కడికి రాజకీయవాదులూ వచ్చిపోయే వారు. అక్కడున్న కాలంలో భగత్‌సింగ్, సుఖదేవ్ తనతో తరచు కల్సి వుండే వారు.

భగత్ తన పెళ్ళి విషయంలో ఫైనల్‌గా తండ్రితో తిరగబడి మొండికెత్తి వచ్చింది ఇప్పుడే.

1927 దసరా ఉత్సవ సందర్భంగా ఎవరో జనంలో బాంబు ప్రేలిస్తే అనుమానితుల్లో భగత్‌సింగునూ అరెస్టు చేశారు. విడుదలకు వేలలో ధరావత్తు కోరారు. యశపాల్ అభ్యర్థన వల్ల గోపీచంద్ భార్గవ అసెంబ్లీలో వాదించి జమానతు విషయం లేకుండా భగత్ విడుదల అయ్యేలా చూసాడు.

పంజాబ్ నౌజవాన్ భారత సభనుంచి యు.పి. విప్లవకారులకు పెద్ద మొత్తంలోనే సహకారం అందింది. అయినా కాకోరి కుట్ర నిందితులు పలువురికి శిక్షలు తప్పలేదు. రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్ర లాహిరీ, అశ్ఫాక్‌ఉల్లా, రోషన్‌సింగ్ నలుగురి ఉరిశిక్షలు పడినాయి. దానితో హిందూస్థాన్ ప్రజాతంత్ర సంస్థ నీరసించింది.

## H.S.R.A. హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ

1928 సెప్టెంబర్ 8,9 తేదీల్లో ఢిల్లీలోని శిధిలమైన ఫిరోజ్‌షాకోటలో విప్లవకారుల సమావేశం జరిగింది. భగత్‌సింగ్, శివవర్మ, సుఖదేవ్, విజయ కుమార్ సిన్హా ఇందుకు ప్రముఖంగా కృషి సల్పారు. ఉత్తర విప్లవ సంస్థలన్నీ దాదాపుగా పాల్గొన్నవి. జయచంద్రను, జె. భారత ఎస్. సన్యాల్‌న్ కావాలనే

పిలువలేదు. బెంగాళ్ "అను శీలన సమితి" నూతన సంస్థ ఆధిపత్యాన్ని కోరితే వారిని వదలివచ్చారు శివవర్మ.

ఆజాద్‌ను పిలవటానికి భగత్‌సింగ్ స్వయంగా వెళ్ళాడు. కాన్‌పూర్ అతను రాలేదు కాని సంస్థ నిర్ణయాలకు కట్టుబడి ఉంటానన్నాడు.

"హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ" పేరుతో నూతన సంస్థ ఆవిర్భవించింది. ఇది భారతదేశంలోనేమొట్టమొదటి పెద్దతిరుగుబాటుసంస్థ. సామ్య వాద, సేవ పదాల వాడకంతోనే దాని ప్రత్యేకత వ్యక్తమౌతున్నది. ఆ పట్టుదల భగత్ సుఖదేవ్‌లది. గత సంస్థవలె స్వాతంత్ర్య సాధనకు సాయుధపోరాటాన్ని అంగీకరించటమే కాక సామ్యవాద సమాజ స్థాపనకూడా దీని లక్ష్యముగా ఉంది.

కార్యనిర్వహణకు 7గురు సభ్యులతో కేంద్ర కమిటీ ఏర్పడింది. వారు 1. భగత్‌సింగ్ 2. ఆజాద్ చంద్రశేఖర్ 3. సుఖదేవ్ 4. రాజుగారు. 5. విజయకుమార్ సిన్హా 6. శివవర్మ 7. కుందన్‌లాల్.

పంజాబ్‌కు- సుఖదేవ్, యు.పి.కి-శివవర్మ రాజస్థాన్-కుందన్‌లాల్ బీహార్‌కు-ఫణీంద్రనాథ్ ప్రాంతీయ కార్యకర్తలు.

ఆజాద్‌ను సంస్థకు సర్వసేనానిగా ఎన్నికయ్యారు. అందుకుకారణాలు యశపాల్ మాటల్లో చూద్దాం.

"చంద్రశేఖర్ ఆజాద్ వెనుకటి విప్లవ సంఘాల్లోనూ, వాటి కార్య క్రమాల్లోనూ పాల్గొన్నాడు. అప్పట్లో ఆయుధాలను ఉపయోగించే పద్ధతికూడా మాకంటే అతనికే బాగా తెలుసు. అయినప్పటికీ తాను అనుభవం కలవాడిననే గర్వం లేకుండా మాతోకల్సి పని చేయడానికి నిర్ణయం అయ్యాడు. అందుకే

ఆజాద్‌నూ సంఘం తరఫున జరిగే సాయుధ పోరాటాలకు నాయకునిగా నిర్ణయిం చారు. అతడు మా విప్లవ సంస్థకు కమాండర్ ఇన్ చీఫ్."

సంస్థ నిర్వహణకు డబ్బు కొరతగా ఉంది. అందుకు వీలయినంతగా అభిమానుల చందాలవలన డబ్బు సేకరించాలని, అత్యవసరపరిస్థితుల్లో తప్పనిసరి అయితే ఒకటి రెండు దోపిడీలు చేయాలనుకొన్నారు. అదీ ప్రజలను కాక ప్రభుత్వ సంస్థలైన పోస్టాఫీసులు, బ్యాంకులను దోచాలని నిర్ణయం.

సైమన్ కమిషన్ బహిష్కరణ మొదటి కార్యక్రమం. యశపాల్ ఈ సమావేశంలో ఏ క్రియాశీల కార్యకర్తగానూ పేర్కొనబడక పోవటానికి కారణం అప్పుడతడింతగా ఆసక్తి చూపక పోవడమే ఆనొచ్చు. అయినా విప్లవ కారులకు సహకరించడం మానలేదు.

## సైమన్ కమిషన్ వ్యతిరేకత:

భారతీయుల స్వాతంత్ర్య పోరాటాల ఫలితంగా ఆంగ్ల ప్రభుత్వము సర్ జాన్ సైమన్ చైర్‌మన్‌గా ఏడుగురు ప్రభ్యులతో ఒక కమిటీ నేర్పరచింది 1927లో అదే సైమన్ కమిషన్ వారు భారతదేశంలో వివిధ నగరాల్లో సంచరించి ప్రజాభిప్రాయాలను సేకరించి దేశానికి స్వతంత్రం ఇవ్వాలో లేదో నిర్ణయిస్తా రట. ఇచ్చినా ఆ స్వతంత్ర ప్రతివత్తి బ్రిటిష్ చక్రవర్తికి లోబడి ఉండే షరతు మీదనే, కోరినా తమవారిని కొందరిని ఆ కమీషన్‌లో చేర్చుకోలేదని కాంగ్రెసు అలకపూని ఆ కమీషన్ను విరసించ నెంచింది. దేశం మాది, స్వతంత్రం మా జన్మహక్కు, దాన్ని సాధించి తీరుతాం. ఈ కమీషన్ జోక్యం అవసరం లేదు. అని దాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు విప్లవ కారులు.

ప్రస్తుతానికి కాంగ్రెసుతో కల్సి నిరసన ప్రదర్శనల్లో పాల్గొనాలని విప్లవ

సేన భావించింది. సైమన్ బృందం 3 ఫిబ్రవరిన ఇండియాకు వచ్చింది. 8 ఫిబ్రవరి 1928 నాడు బొంబాయిలో సైమన్ కమిషన్‌ను 60 వేల మంది కార్మికులతో కామ్రేడ్ డాంగే బ్రహ్మాండమైన ప్రదర్శన తీశాడు. మద్రాసులో ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, లక్నోలో జవహర్‌లాల్ నెహ్రూ గొప్ప ఊరేగింపులతో వ్యతిరేకించారు.

20 అక్టోబర్ నాడు లాహోర్‌లో కమీషన్ వ్యతిరేక ప్రదర్శనకు లాలా లజపతిరాయ్ నాయకుడు. నేజవాన్ భారత సభవారు ఆయనకు ముందు నిలిచారు. నల్ల జెండాలతో పెద్ద ఊరేగింపు రైల్వేస్టేషన్ వైపు వెళ్ళింది. "సైమన్‌గోబ్యాక్" నినాదాలు మార్రోమ్రోగినై. రైలు దిగగానే సైమన్‌ను చుట్టిముట్టి వాపసు పంపించాలని వారి తలంపు. జనాన్ని చెదర గొట్టడానికి పోలీసులు లాఠీచార్జి జరిపారు. లాలాజీకి సైతం తీవ్రంగా గాయాలైనవి. సభ ఆపుచేశాడాయన.

ఇదంతా చూస్తూ యశపాల్ భగవతీ భాయితో పాటు వాపసు వస్తున్నాడు. "పాపల్ మండీ"లో రాయబహద్దూర్ లక్ష్మణ్‌దాస్ బట్టల దుకాణం తెరచి ఉంది. అతడు ఆంగ్ల ప్రభుత్వం తొత్తు. ఆ బిరుదే అతని దాస భావానికి చిహ్నం. దుకాణం మూయాలని అటుగా వచ్చిన ప్రదర్శకుల జుట్టు పట్టు పట్టింది. రగడా పెరిగింది. కొట్టు మూయలేదు సరికదా కొట్టడానికి తనపోషణలోని రౌడీలను రంగంలో దింపాడు. పులులు గొర్రెలమందపై పడినట్టయింది. వాళ్ళు వస్తాదులు, వీళ్ళు శాంతి సత్యాగ్రహులు, దెబ్బల తాకిడికి జుట్టు నిలవలేక పోయింది. జుట్టు నాయకుడు మౌలానా జాఫర్ అలీ పరుగందుకున్నాడు. ఆ వైఖరికి విస్తుపోయి "మౌలానా గారూ! ఆగండి. ప్రజలను కొట్టవద్దని వీరికి చెప్పండి" అని పిలిచాడు భగవతీ చరణ్. "అమాయకులైన ప్రజల్ని కాదు కొట్టేది. ధైర్యముంటే వచ్చి

నన్ను కొట్టుమని వాళ్ళకు చెప్పండి" అంటూ మౌలానా ఆగకుండా పరుగెత్తాడు. అదీ సత్యాగ్రహి లక్షణం.



తానుగా ముందుకువచ్చి ప్రజలకు ధైర్యం చెపుతున్న భగవతీభాయి తలపై దెబ్బపడింది. అటు కదలపోయేసరికి యశపాల్‌కు బలమైన దెబ్బ తగిలి సొమ్మసిల్లి పడిపోయాడు. కొంతసేపటికి తెలివికి వచ్చి లేచి చూస్తే జనం ఎవరూ లేరు. భగవతీభాయి ఒక కరెంట్ కంబాన్ని పట్టుకొని నిలబడ్డాడు. కళ్ళద్దాలు ఎక్కడో పడిపోయినై, యశపాల్ వెళ్ళి అతన్ని మెల్లగా నడిపించుకొని ఇల్లు చేర్చాడు.

ఆ దినం సాయంత్రమే మోరీ దర్వాజా దగ్గర ప్రభుత్వ దౌర్జన్యకాండకు నిరసనగా పెద్ద సభ జరిగింది. రెండు మూడు అంగుళాలలోతైన గాయాలయి నప్పటికీ లాలాజీ స్వయంగా ఆ సభలో పాల్గొని ప్రసంగించాడు.

"నా శరీరంపై పడిన ఒక్కొక్క దెబ్బ బ్రిటిష్ పాలకుల శవపేటికలపై బిగించే ఒక్కొక్క మేకు నిరాయుధులైన ప్రజలమీద అమానుషంగా క్రూర హింసను సాగించే ఈ ప్రభుత్వం ఇంకా ఎక్కువ కాలం నిలిచి ఉండజాలదని నేను చాలెంజి చేసి చెప్తున్నాను" అన్నాడు.

ఆ మాటలకు ఆంగ్లపోలీసు అధికారి "సీల్" నవ్వాడు చులకనగా.

"ఇది భరింపరాని విషయం" అన్నాడు యశపాల్ సుఖదేవ్‌లో అతడు మాత్రం" వాహ్! చాలెంజి చేస్తున్నాడు ఆ లాలాజీ. ప్రొద్దున ఊరేగింపుమధ్యలో ఆపారు. ఇప్పుడు ఇంకొంచెం కోపం వచ్చెనా ఈ సభను ఆపి వెళ్ళిపోగలరు." అన్నాడు.

అదే గాయాలతో 17నవంబర్‌న లాలాజీ మరణించాడు. దేశమంతా శోకంతో క్రోధంతో ఊగిపోయింది. ఇది యువకులకో సవాలైంది. దీనికి ప్రతీ కారం తీసుకొనే బాధ్యత H.S.R.A. తన భుజాలపై వేసుకొంది.

## సాండర్స్ హత్య :

ఆజాద్, భగత్‌సింగ్, రాజగురు, జైగోపాల్ విప్లవకారులు యుక్తిగా లాహోర్ పోలీస్‌స్టేషన్ ముందు సైకిల్ మోటారుపై వెళ్ళే జె.పి. సాండర్స్, డి. ఎస్. పి. ని కాల్చిచంపారు. అతడే క్రూరంగా లాలాజీపై లాఠీ ప్రయో గించింది. ఆ లాఠీ చార్జికి ఆర్డరిచ్చిన పోలీసు సూపరింటెండెంట్ జె.వి. స్కాటునూ చంపాలనుకొన్నారు. అదే రాత్రి ఈ చర్యకు ఎవరు ఎందుకు చేశారో వివరిస్తూ,

"లాలాజీ హత్యకు ప్రతీకారం తీర్చుకొన్నాం. క్రూర ప్రభుత్వమా జాగ్రత్త" అని హెచ్చరికతో "బలరాజ్" (ఆజాద్) సంతకంతో కరపత్రాలు పంచారు.

అరెస్టుల భయంతో కార్యకర్తలు వెళ్ళిపోవాలంటే డబ్బులేదు. సుఖదేవ్ వచ్చి అడగటంతో యశపాల్ తనవద్ద డబ్బులేకున్నా గోపీచంద్ నడిగి రెండు వందలిచ్చాడు. గోపీచంద్ భార్గవ సలహాతో లక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీలో క్లర్క్‌గా పని చేస్తున్నాడప్పుడు యశపాల్ తమ రాజకీయగురువు లాలాజీ హత్యకు ఎదురుదెబ్బ తీసినందుకు గోపీచంద్ సంతసించినా ఆ డబ్బు తర్వాత యశపాల్ జీతంలో పట్టుకొన్నాడు.

భగవతీ చరణ్ కలకత్తా వెళ్ళాడు "మీరట్"కుట్ర వారెంట్ కారణంగా. దుర్గాదేవి, ప్రకాశవతి, సుశీలా దేవిపై సైతం వారెంటులు జారీ అయినై. సుశీల "జలంధర్ కన్యా విద్యాలయం" ఉపాధ్యాయని ఉద్యోగం మాని కలకత్తాలో ట్యూటర్‌గా ఉంటున్నది.

దుర్గాదేవి సుఖదేవ్‌కు ఈ సందర్భంలో 500 రూ॥ ఇవ్వటమేకాక భగత్ సింగ్‌కు భార్యగా నటిస్తూ పారిపోవటానికి సహకరించి మిత్రునితో పాటు భర్త దగ్గరికి వెళ్ళిపోయింది.

## పరారీ జీవితం :

విప్లవ కార్యాలకు దూరంగా ఉంటున్నా విప్లవకారులకు సహకరిస్తూనే ఉన్నాడు యశపాల్. "క్రాంతి పరోపకారం కోసమని కాక వ్యక్తి జీవితావసరమైన విషయం"గా భావిస్తున్నాడు. ఆ గుమస్తా ఉద్యోగం అతనికి నచ్చుతూలేదు.

ఇంతలో కేంద్ర విప్లవ సంస్థ ఆగ్రాలో బాంబుల నిర్మాణం చేపట్టింది. బెంగాళ్ నుంచి యతీంద్రనాథ్ బాంబుల తయారీని నేర్పించడానికి వచ్చాడు. తర్వాత

సుఖదేవ్ లాహోర్‌లోనూ, శివవర్మ షహరన్‌పూర్‌లోనూ రహస్యంగా బాంబుల ఫ్యాక్టరీలు తెరిచారు. భగవతీ చరణ్ ఇల్లు విప్లవ కారులతో, ఖైదీల బంధువులతో సందడిగా ఉండటంవలన పఠన కోసం వేరే తీసుకొన్న ఇంటిలోనే సుఖదేవ్ తిష్ట వేశాడు. యశపాల్ కూడా అతనికి సహకరించాడు.

ఆగ్రాలో తయారైన బంబులే భగత్‌సింగ్, భటుకేశ్వర దత్తు 8 ఏప్రిల్ 1929 నాడు ఢిల్లీ అసెంబ్లీలో ప్రయోగించారు. ప్రజాహక్కులను హరించే బిల్లులకు వ్యతిరేకంగా పార్టీ ఆదేశంతో వారా సాహసానికి పూనుకొన్నారు. స్వేచ్ఛ కోసం యువరక్తం తిరుగబడుతున్నదని నిరూపించారు. విప్లవం వర్ధిల్లాలి! సామ్రాజ్యవాదం నశించాలి!! అనే ఆ వీర కిశోరాల సింహగర్జనలు ఆంగ్లమత్తేభాల కర్ణాలకు శూలాలై గుచ్చుకొన్నవి.

అప్పుడువారు తప్పించుకుపోయే వీలున్నా అరెస్టయినారు. సంస్థపేరున వారు వెదజల్లిన కరపత్రాలు సాయుధ పోరాట చరిత్రలో చెరిగిపోని. అక్షర సత్యాలు.

“ఒక మానవుని మరోమానవుడు దోచుకోవడానికి వీలులేని సామాజిక వ్యవస్థను రూపొందించడం కోసమే మేం క్రాంతిని ఆహ్వానిస్తున్నాం” అని ధైర్యంగా ప్రకటించారు.

బటుకేశ్వరదత్తు కాకోరీ కుట్ర కాలపు క్రాంతికారి, భగత్‌సింగ్ మాత్రం యశపాల్ మిత్రుడు, భగత్ కార్యదీక్షకు మిత్రుని మనస్సు చెమ్మగిల్లింది.

ఆ సందర్భంలో పోలీసుల నిఘా పెరిగి 13 ఏప్రిల్ రాత్రి లాహోర్ బాంబుల ఫ్యాక్టరీ పట్టుబడింది. (14 మే దినాన యు. పి. శివవర్మ ఫ్యాక్టరీ పట్టుబడింది). సుఖదేవ్, జయగోపాల్ కిశోర్‌లాల్ అరెస్టు కావించబడ్డారు. యు.పి.లో శివవర్మ, జయదేవ కపూర్ ఆ తర్వాత డా॥ గయాప్రసాద్ దొరికిపోయారు.

ఫణీంద్రనాథ్ కలకత్తాలో దొరికిపోయిన కారణంగా యతీంద్రనాథ్, కమలనాథ్ తివారి, వైద్యనాథ సింహ, సురేంధ్ర పాండే, లలిత మోహన్ బెనర్జీ, బందీలు కావించబడ్డారు.

లాహోరు ఫ్యాక్టరీలో అప్పుడు యశపాల్ లేకున్నా అతని బట్టలు పాత్రలు అక్కడే ఉన్నాయి. వాటిపై అతని పేళ్ళున్నవి. ఇక అనుమానానికి అరెస్టుకు ఎంతదూరం.

భగత్-దత్తు బాంబు పేల్చినట్టు రూపొందించిన ఊహాచిత్రాన్ని ఎన్లార్జ్ చేయించి స్టుడియో నుంచి వస్తుండగా ఒక పోలీసు యశపాల్‌ను అనుసరిస్తే తప్పించుకొచ్చాడు. ఆ విషయం సుఖదేవ్‌కి చెప్పి జాగ్రత్తకోసం హెచ్చరించి తన గదికి వెళ్ళాడు. త్వరగా బాంబుల తయారీ 14 నుంచి ముగించి మకాం ఎత్తివేద్దామన్నాడు సుఖదేవ్.

మరునాడు 14 ఉదయం భగవతీ చరణ్ ఇంటికి వెళ్ళేసరికి పోలీసులు సోదాకోసం వచ్చి ఉన్నారు. దుర్గాదేవి తన కోసమే ఎదురు వస్తున్నది. ఇంట్లో సుఖదేవ్ బాంబు డిప్పలు వదలి వెళ్ళాడింది దుర్గాదేవి. అతడు వెళ్ళి స్వదేశీ అనే మిత్రురాలిని పిల్చుకు వచ్చాడు. సుశీలాదేవి పెంపుడు కొడుక్కు జ్వరంగా ఉంటే మందు తెచ్చానంటూ ఆమె లోపలికి వెళ్ళి ప్రమాదకర వస్తువులను భద్రపరచుకొని పోలీసుల కన్నుకప్పి వెళ్ళి వచ్చింది. సాక్ష్యానికి ఎవరినైనా పిల్చుకొనివస్తానని పోలీసులు ఆపి వచ్చిన దుర్గాదేవి తిరిగి వెళ్ళి సోదాకు అనుమతించింది.

ప్రమాదం గడిచింది.అంతలోకే సుఖదేవ్ ఫ్యాక్టరీ పట్టుబడిన విషయం యశపాల్ తెల్సుకొని వచ్చి ఆమెకు తెల్పి చరణ్‌ను అటు వెళ్ళనీకండి అని చెప్పి వెళ్ళాడు.

"అమ్మా! నేను వెళ్ళిపోతున్న. కొన్నాళ్ళకు తిరిగి కనిపించవచ్చు.

రాకపోతే ఇదే తుది వీడ్కోలు" అన్నాడు యశపాల్ తల్లి దగ్గరకు వెళ్ళి, ప్రేమ దేవి లాహోర్‌లోనే ఉద్యోగంలో చేరింది. ప్రేమవతి కూడా ఇక్కడే ఉంది. ఈమె అందించిన విప్లవకారిణులే ప్రకాశవతి, స్వదేశి.




అంతవరకు విద్యార్థిగా దుస్తులు ధరించేవాడు అప్పుడు నున్నగా గడ్డం మీసం కొరిగి సూటుహేటు ధరించి పెద్ద మనిషిగా రూపం మార్చి కాంగడాకు వెళ్ళాడు. స్వగ్రామం వెళ్ళటం అలాంటి పరిస్థితిలో వేటగానింటికి కుందేలు ప్రవేశించినట్లే అని ఆ తర్వాత తెలిసింది. రహస్య జీవితానికి పరుగులు పెట్టవలసిన అవసరంలేదు. ఆత్మవిశ్వాసమే దానికి గొప్ప మంత్రం అని అప్పుడు గ్రహిం

చాడు. "ఈ కిటుకు తెలిసింతర్వాత అదే లాహోరులో సాధారణమైన వేషం మార్పుతోనే ఎంతో నిర్భయంగా తిరిగాను. ఎటు చూసినా నన్ను బంధించడానికి వాల్‌పోస్టర్స్ అంటించబడిన వీధుల్లో నిరాటంకంగా తిరిగాను. ఒకమాటు లాహోరు స్టేషన్‌లో నా జేబులోని పిస్తోలు పొరపాటున బయటికి కనపడింది. అయినా ఏ మాత్రం తొట్రుపాటు కనబడనీకుండా హుషారుగా ఈలవేస్తూ చేతిలోని తూటాలు ఎగురవేస్తూ, నిర్భయాన్ని నటిస్తూ రైలెక్కేశాను. ఇతరులకు సందేహం కలుగకుండా ఉండాలంటే ఇంతకైన సులువైన మార్గంలేదు-"—యశపాల్ "సింహావలోకన్".

కాంగడాలో ఒక వకీలు ఆశ్రమంలో ఉన్నాడు. అభిమానులైన సహాయకులను మోసగించడం బాగుండదని తన విషయమంతా చెప్పాడు. అతడాలోచించి "పోలీసులను తప్పుకొని దొంగగా ఉండే కంటే వారికి లొంగిపోవడమే మంచిది" అని సలహా యిచ్చాడు. తర్వాత మేం విడిపిస్తాం అని మాట యిచ్చాడు. కాదని రహస్యంగానే ఉద్యమానికి తోడ్పడాలని ఉంటే ఈ పల్లెలు మాత్రం దానికి అనువైన చోటు కాదు. కొత్తవాళ్ళను అనుమానిస్తారు. త్వరగా పట్టుబడతావు, అనీ అన్నాడు.

పత్రికల్లోని వార్తల్లో సుఖదేవ్ దగ్గర పిస్తోలు ఉండీ ఎదిరించకనే పోలీసులకు పట్టుబడినట్లు, తర్వాత వారికి పార్టీ రహస్యాలు తెలిపినట్లూ చదివాడు. అది అతని అతి ప్రవర్తన. సుఖదేవ్‌ను చంపేయాలన్నంత కోపం వచ్చింది యశపాల్‌కు. కాంగాడా కొండమీది శిథిలమైన కోటలో కూర్చుని ఇలా అనుకున్నాడతడు.

"నిర్జనమైన కొండల్లో అడవుల్లో దాక్కుని బాంబుల్ని తయారుచేసి విప్లవం సృష్టిస్తామనుకోవటం మూర్ఖమైన ఆలోచన. సామాన్య ప్రజల వల్లనే

కదా విప్లవం సాధ్యం. అలాంటప్పుడు ప్రజలకు దూరంగా ఉండడం తెలివి తక్కువ తనంకాదా? ఆత్మచింతన ద్వారా ఆధ్యాత్మిక శక్తిని పెంపొందించుకోవటానికి మాత్రం అడవులు భేషుగా పనికి వస్తాయి— కాని, విప్లవోద్యమాలకు మాత్రం పనికిరావు.

మానవ వృక్షాలతో నిండి ఉండే మహానగర అరణ్యాల్లో దాగి ఉండి రహస్యంగా మిత్రులను కలుసుకొని తిరిగి ఉద్యమం సాగించడానికి నిశ్చయించుకున్నాడు.

## జమ్మూ ప్రయాణం—

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ - అమృత స్వరూపిణి అయిన అమ్మ మనస్సును సంతృప్తిపరచలేక పోయాడు. ఆకుపచ్చని వృక్షాలతో నీలికొండల్తో అలరారే "కాంగడా" జన్మస్థల అందానికీ ఆనందించలేకపోయాడు. అప్పటి మానసిక స్థితివేరు. మిత్రులు కలవాలి. ఉద్యమం కొనసాగించాలి- అనేదే ధ్యాస. వాతావరణంలో వేడిగాలి చల్లారేవరకు కొంతకాలం ఓపిక పట్టాలని జమ్మూ వెళ్ళాడు. 1926లో కొంతకాలం అక్కడ గడిపాడు. అప్పటికి మరే పెద్ద నగరమూ అతనికి తెలువదు లాహోరు తప్ప. చిరంజీలాల్ అనే చుట్టం ఇంట ఆగాడు. పాతమిత్రుడైన ఒక బడిపంతులుద్వారా భాగ్‌రాం అనే నూతన మిత్రుడు లభించాడు. అక్కడ పరిచయమైన విద్యావంతులకు క్రమంగా విప్లవ చైతన్యం కలిగించసాగాడు.

ఇంద్రపాల్‌కు లేఖ వ్రాసి లాహోరు రాజకీయ పరిస్థితులు తెలుసుకున్నాడు. ఇతడు కోరిన ప్రకారంగా దుర్గా ప్రకాశవతుల నడిగి కొన్ని పుస్తకాలను అతడు పంపించాడు.

## లాహోరు చేరిక—

జైల్లో భగత్, సుఖదేవ్ సాగిస్తున్న నిరాహార దీక్ష గురించి తెలిసింది. ఏమైనా అయిందని బయల్దేరాడు. మాసిన చొక్కా లుంగీ తలపాగతో రూపం మార్చి లాహోర్ చేరి అనార్కలీ బస్తీలోని ఇంద్రపాల్‌ను కలుసుకున్నాడు.అతని ద్వారా ప్రేమవతి వచ్చి జైలులోని విశేషాలు తెల్పింది.దుర్గాదేవి పోలీసుల కాపలా ఎక్కువైన కారణంగా రాలేదు.

యశపాల్‌కు జైలుకు వెళ్ళి మిత్రులను కల్సి మాట్లాడాలని ఉంది. అతని కోరికగా ప్రేమవతి ప్రయత్నించి ధన్వంతరీ ఎహసాన్‌ల ద్వారా లాయర్ డ్రెస్సు పంపించింది. సుశీలాదేవి చెల్లెలగు శకుంతలను సుఖదేవ్ చెల్లెలుగా వెంట తీసుకొని దుర్గాదేవి సలహానుసరించి వకీలుగా జైలుకెళ్ళాడు యశపాల్. సుఖదేవ్ పక్షపు న్యాయవాదిగా ఉత్తుత్త ఫైలుతో సహా వెళ్ళి సజీవ నాటకమాడి సుఖదేవ్‌తో మాట్లాడి పార్టీ మిత్రుల వివరాలు తెల్సుకొని జైలరు కన్నుగప్పి బయటపడ్డాడు.

ఆ అడ్రస్సుల ప్రకారం విప్లవమిత్రులను కల్సుకొనే ప్రయత్నంలో ఉండగానే మే 14 నాడు షహరాన్‌పూర్ ఫ్యాక్టరీ పట్టుబడింది. ఆగ్రా తర్వాత అదే క్రాంతికారులకు పెద్ద కేంద్రం.ఆ దినం అక్కడ ఎక్కువమంది లేకపోవడం విశేషం. శివవర్మ, జయదేవ కపూర్ పట్టుబడినప్పుడు వీలైనంతగా రక్షకభటులను ముప్పుతిప్పలు పెట్టందే సరెండర్ కాలేదు. అప్పుడు పోలీసులన్న మాటలు గమనింపదగినవి. "మాదేముంది బాబూ! పొట్టకూటికి బతికే కుక్కలం. మేం చచ్చిపోతే మాత్రం నష్టమేమిటి? మాలాంటి వాళ్ళు రోజూ ఎంతమంది చావటంలేదు? మీ జీవితమే జీవితం బాబూ, ఇతర్లకోసం ఇలా త్యాగం చేస్తున్నారు." ఆ మాటలంటూ వాళ్ళ కళ్ళు చెమ్మగిల్లాయి. వినేవాళ్ళకో !

వారిని బంధించిన ఎస్.ఐ. కూడా ఆ తర్వాత "ప్రాణాలకు తెగించి

(ఆశకు) మిమ్మి పట్టుకుంది నేను. డి.ఎస్.పి. జోషి తాను పట్టుకున్నట్టుగా వ్రాసుకున్నాడు." అని ధర్మానికి స్వసుఖానికి కోల్పోయినందుకు బాధపడ్డాడు.



ఉద్యమకారులు దేశం కోసం ప్రాణాలకు తెగించినవారు. పోలీసు ఉద్యోగులు జీతంకోసం ప్రమాదాల నెదిరించేవారు. వారికీ వీరికి సామ్యమెక్కడ? ఏ దారి కనరాక ఇదే సులభ జీవన మార్గమని దుండగాలకు పూనుకునేవారు వేరు. వారు చరిత్రహీనులు. అందులో అటువంటి గూండాలను అనేకురిని పోషిస్తున్నది ఘరానా దొంగబాబులే.

అక్కడఉండి చేసేది కనిపించక అడ్రస్సు తెల్సుకొని భగవతీచరణ్‌ను కల్సుకొనడానికి కలకత్తాకు వెళ్ళాడు.

## భగవతీ చరణ్ కలయిక—

శేర్‌చాజూరాం మేడతో సుశీలాదేవిని కలిశాడు. అలా ముందుగా తెలియజేయకుండా యశపాల్ వచ్చినందుకు ఆమె కాస్త విచారించినా విప్లవ మిత్రుల సమాచారం తెల్సి సంతోషపడి ఆదరించింది. ఇద్దరూ ఒక సాయంత్రం కలకత్తా చేరంగి సెంటర్‌లో భగవతీభాయిని కలిశారు. అప్పుడతడు ముతకదుస్తుల్లో పల్లెటూరి మనిషిగా ఉన్నాడు. విషయాలను ముచ్చటించుకున్నారు. అతడో మారుమూల ఇంట్లో ఉంటూ అప్పుడప్పుడు చెల్లెలిని కల్సుకుంటున్నాడిలా. యశపాల్ అక్కడికి ఠికానా మార్చాడు.



అరెస్టయిన యతీంద్రనాథ్ తమ్ముడు కిషన్‌దాసునుకల్సి రెండు పిస్తోల్లు

సంపాదించుమని 300 రూ॥ ఇచ్చాడు చరణ్. యశపాల్ జేబు ఖాళీగానే ఉంది. ప్రేమవతి ప్రోగుచేసి ఇచ్చిన డబ్బుతోనే ఇక్కడికి వచ్చాడు.

లాహోరులో దుర్గాదేవి ఖైదీలకు వారి బంధువులకు చేస్తున్న సేవలు స్వయంగా చూసి వచ్చాడు కనుక కిషన్‌దాసు వీరిని గౌరవంగా చూశాడు. అతని ద్వారా బెంగాళీ విప్లవకారులతో సంబంధం పెట్టుకోవాలని వీరు ప్రయత్నిస్తే వారు జయచంద్ర మాటల ప్రభావంలోపడి దూరమే ఉంచారు.

బాంబులు తయారుచేసి, ఏదైనా యాక్షన్ విప్లవ చర్యచేసి కేంద్ర సమితితో పొత్తు పెట్టుకోవాలని భగవతీ చరణ్‌కు కోరికగా ఉంది. లేకుంటే వచ్చిన నిందపోదు. మనస్సు తృప్తిపడదు.

భాగ్‌రాం అనే మిత్రుని ద్వారా బాంబులు చేయడం సాధ్యమని యశపాల్ తెల్పడంతో 200 రూ॥ ఇచ్చి అతన్ని జమ్మూ పంపాడు చరణ్.

## బాంబుల తయారీ—

భగవతీ భాయి వచ్చేసరికి భాగ్‌రాం సహాయంతో బాంబు తయారు చేశాడు యశపాల్. తవీనదీ తీరంలో దాన్ని ప్రయోగించి చూస్తే మంచి ఫలితం కనరాలేదు. ఉత్సాహం అడిగేది కాదు, ఉద్యమం ఆగేది లేదు. బాంబులు నిర్మించాలి, ప్రభుత్వాన్ని కదిలించాలి. బాంబుల తయారీలో సిద్ధహస్తులైన యతీంద్ర, సుఖదేవ్, శివవర్మ బందీలై ఉన్నారు. తనకు నేషనల్ కాలేజీ సహచరుడు ప్రస్తుతం అక్కడే కెమిస్ట్రీ లెక్చరర్‌గా పనిచేస్తున్న దేవదత్తశర్మ సహకరించ వచ్చుననే ఆలోచన వచ్చింది చరణ్‌కు. అతడు సెలవులకు సొంతూరు శ్రీనగర్‌కు వచ్చి ఉంటాడు కనుక అక్కడికి వెళ్ళి పనిచూసుకు రమ్మని యశపాల్‌కు డబ్బిచ్చాడు. తాను తెచ్చిన పిస్తోల్ ఇవ్వబోతే రక్షణకు నీకే అవసరమని తీసుకోలేదు యశపాల్. కిషన్‌దాసు వద్ద మరోపిస్తోలు తీసుకొని కలకత్తా నుండి ఢిల్లీ వెళ్ళి తమకో ఆశ్రమ స్థావరం ఏర్పాటు చేస్తానన్నాడు చరణ్.

# శ్రీ నగర్‌లో

జమ్మూ నుంచి కాశ్మీర్-శ్రీనగర్‌కు 205 మైళ్ళు, బస్సులోనే ప్రయాణం. బటోట్ పర్వతలోయల్లో దేవదారువనాల వెనుక అద్భుతంగా అంతరిస్తున్న సూర్యబింబ సౌందర్యాన్ని, ఒక ఎత్తైన కొండరాతిపై శుభ్రమైన దుస్తులతో నిలిచి తన్మయత్వంతో తిలకిస్తున్న పాశ్చాత్య దంపతులు జంటను చూశాడు.



అదే మార్గంలో "వెరీనాగ్" సుందర పర్వతారణ్య గ్రామంలో ఫలవృక్షాల క్రిందుగా నడిచే జనం "ఎర్రని శరీరాలే అయినా మురికిపట్టి మాసినట్లుగా కన్పి

స్తున్నాయి. బాగా మాసిన గుండ్రని సొట్టటోపీలు పెట్టుకొన్నారు. చినిగి పీలికలై మోకాళ్ళ వరకు వచ్చే చొక్కాలు తొడుక్కొన్నారు."

ఈ వ్యత్యాసాలకు ఎవరి మనస్సు కలుక్కుమనదు. యశపాల్ రచయిత ఉద్యమకారుడు కనుక స్పందించే హృదయంతో ఇలా అనుకొన్నాడు" నిరంతరం శ్రమించే స్థానికులు పస్తుల్తో కృశించి నశించి పోతున్నా, ఎక్కడినుండో వచ్చిన వీళ్ళు వాళ్ళ రక్తం పీల్చి పిప్పి చేస్తూ ఉల్లాసంగా జీవిస్తున్నారు." అని ద్వేషాన్ని పెంచుకొన్నాడు.

"సీడోజ్" అనే స్టాండర్డు హోటల్లో ఆగాడు. అక్కడ యురోపియనులు, ధనవంతులు మాత్రమే ఆగుతారు. సామాన్యులకు ఆరేటు భరించడం కష్టం. అక్కడ ఆగటం మేలే అయింది; శర్మ అన్న మెజిస్ట్రేట్‌తో పరిచయము సమయానపై వాళ్ళు హైలెవల్‌ను బట్టి గౌరవం చూపుతారు కదా. పరగ్రామము వెళ్ళిన దేవదత్త శర్మ రెండు రోజులకు రానేరాదని తెల్సింది. అంతవరకు కాశ్మీర్‌లో చూడదగిన ప్రదేశాలు తిరిగి చూడనెంచాడు. వచ్చేటప్పుడు భగవతీ భాయి చెప్పాడు కూడా "కాశ్మీర్‌లో చూడదగిన ప్రదేశాల విషయంలో అశ్రద్ధ చేయకు తిరిగి వెళ్ళడం ఎప్పుడు వీలవుతుందో, ఖర్చుకు వెనుకాడకు." ఒక హౌజ్‌బోట్ అద్దెకు తీసుకొన్నాడు. దానిని విదేశీయులు అద్దెకు తీసుకొని వేటకు వెళ్ళారుగనుక చౌకగా లభించిందితనకి. జీలంనది పాయల్లో పయనించే అందమైన నావలను, తెప్పవనాలను, దేవదారు వృక్షపంక్తులను, మంచు కొండలను, నదిపైకి పరచుకొని ఉన్న శ్రీనగరాన్ని చూసాడు. అన్నిటికి మించి యాత్రికులముందు చేతులు చాపి దీనంగా నిలిచి ఆశతో చూచే స్థానిక బాలకుల చూశాడు. యూరోపియనుల ముఖ్యంగా వారి స్త్రీల కసితో తిట్టే యువకుల చూసాడు.

అక్కడ గులేమర్గలో కలిసిన ఝంగ్ యువకుల విడిదికి తన నివాసం

మార్చాడు. దేవదత్త శర్మ సహాయం అందించడాన్ని ఒప్పుకొన్నాడు, యశపాల్ ప్రాణం పణం పెట్టయినా రహస్యం కాపాడుదామని చెప్పడంతో, ఆ విషయము (ఫార్ములా) జ్ఞాపకంలో లేదని శర్మ స్థానిక కాలేజీ లైబ్రరీ పుస్తకాలు చూడ వెళ్ళాడు.

భగత్‌సింగ్ కోర్టులో ఇచ్చే వీరవాజ్ఞ్మాలాలను పత్రికల్లో గర్వంగా చదివే అక్కడి ప్రజల చూసి ఆనందించాడు. దేశం విప్లవ ప్రభావానికి లోనవుతున్నదని, విముక్తికి చేరువవుతున్నదని ఆనందించాడు.

శర్మ దగ్గరి వివరాలు లభించగానే రావల్పిండి పేషావర్‌ల మీదుగా లాహోర్ చేరి ఇంద్రపాల్‌ను సహాయానికి రమ్మని ఢిల్లీ చేరాడు.

## ఢిల్లీలో మంకాం :

ఇన్సూరెన్స్ ఏజెంట్స్‌గా వేషాలు మార్చి ఢిల్లీ అద్దెయింటిలో చేరు కొన్నారు ఇద్దరు మిత్రులు. బాంబుల తయారీకి పట్నం కంటె పల్లె ప్రాంతాలే క్షేమమని భగవతీచరణ్ భావించాడు. లేఖారాం అనే వైద్యమిత్రుని సహాయంతో రోహతక్‌లో బాంబుల నిర్మాణానికి యశపాల్‌ను పంపాడు. చరణ్ వెళ్తానన్నాడు కాని అక్కడికి వెళ్ళేవ్యక్తి లేఖారాం నౌకరుగా నటించాలి. అందుకు చరణ్ రూపం సరిపడదు. పైగా ఇక్కడ విప్లవ కారులతో సంబధాలు పెంచుకోవలసి ఉంది. ఇంకా ఉద్యమ సానుభూతి పరులను సంపాదించుకోవాలి. వీరు ప్రమాద వేళల్లో ఉద్యమ కారులకు తోడ్పడుతారు. బాంబు ప్రేల్చటానికి అనువైన ప్రదే శాన్ని ఎంపిక చేయవలసి ఉంది. ప్రమాదం కల్పించిన తర్వాత పార్టీ పేర ఒక కరపత్రం ప్రచురించవలెననీ ఉంది. అందుకోసం ఆజాగ్‌ను కల్సుకోవాలి. ఇన్ని కారణాలచేత భగవతీ చరణ్‌ను వద్దని తానే గ్రామీణుడుగా కిట్టప్ప అనే పేరుతో వెళ్ళాడు యశపాల్.

ఎంత చక్కగా ఆ పాత్రలో ఇమిడాడంటే, అక్కడ నీళ్ళు మోసే పని మనిషి తప్పులెక్కను సరిచేస్తే "చచ్చినోడా! నీకు లెక్కలుకూడా వచ్చునట్రా?" అని ఎకసక్కెమాడింది.

ఆ ప్రక్కనే ఉన్న ఆర్యసమాజ మందిరంలో ఒక సాధువు ఉండేవాడు. మంచినీళ్ళు తేవటానికి అక్కడికి వెళ్ళే యశపాల్‌కు అతనితో పరిచయమయింది. ఇతనికి చదువురానందుకు అతడు జాలి పడేవాడు. ఒకనాడు కిట్టప్ప వెళ్ళేసరికి సాధు ఏదో పుస్తకం చదువుకొంటున్నాడు. దానిపేరు చూసి ఆశ్చర్యపడి "ఏం పొస్తుకం సదువుతుండారండీ సాములోరూ? రామాయండమా?" అని అడిగారు యశపాలు.

"అలాంటిదే శాస్త్ర ధర్మగ్రంథం" అన్నాడు సాధూజీ. నిజానికి అదో బూతు పుస్తకం!

తలలు బోడులైన తలపులు బోడులా-విశ్వదాభిరామ... "అందరము రాజకీయ ఖైదీలమే. విప్లవకారులు వేరుకాదు. కాంగ్రెసు బందీలకిచ్చే సౌకర్యాలు మాకూ కల్పించాలి" అని జైల్లో భగత్ మిత్రులు నిరాహారవ్రతాలు ఆందోళనలు పెంచాడు.

ఇటు ఇక్కడ రోహతక్‌లో బాంబుల నిర్మాణం జరిగింది.

## ఆజాద్ పరిచయం :

మధుర ఢిల్లీ లైనులో కౌరవ-పాండవుల ఖిల్లా వద్ద బాంబు పేల్చటానికి తగిన ప్రదేశంగా ఎంపికచేశాడు చరణ్, ఆగస్టులో ఢిల్లీ చేరాడు యశపాల్, సెప్టెంబర్‌లో ఇంద్రపాల్‌ను నిజమైన సాధురూపంలో ఆ కోటలో ఉంచి రైళ్ళ రాకపోకల సమయాలు పోలీసుల కాపలా వ్యవహారాలు కనిపెట్టుమన్నారు. ఈ

ఇద్దరు మిత్రులు ఢిల్లీ షాహుకార్లుగా వెళ్ళి భక్తి నటిస్తూ ఆ సాధుకు ఆహార పదార్థాలిచ్చి విషయాలు ముచ్చటించి వచ్చేవారు. పోలీసుల ప్రమాదాలను తప్పుకొన్నారు. వారికీ సాధూబాబాపై గురి కుదిరింది. లంచగొండులు వాళ్ళు. ప్రజలకు బాబా అంటే భక్తి. ఆ ప్రక్కగా ఉన్న రెండు పల్లెలకు భిక్షాటనకు వెళ్ళుతూ అక్కడి రైతుల దుర్భర జీవితాలకు ప్రభుత్వం అశ్రద్ధకు అధికారుల దోపిడీకి బాధపడేవారు ఇంద్రపాల్.

ఆజాద్‌ను కల్సుకోవాలని ఝాంసీ, గ్వాలియర్‌ల నుండి కాన్పూర్ వెళ్ళాడు భగవతీ చరణ్. అతడు డబ్బు ఇబ్బందిలో ఉన్నాడని తెల్సి 500రూ॥ వరకు సహకరిస్తామనీ చెప్పిపంపాడు.

తనకేదీ వద్దని జవాబు పంపాడు ఆజాద్.

"సరే! భైయాను జాగ్రత్తగా ఉండుమనండి. మేము అక్టోబర్ 24 నాడు వైస్రాయి ట్రైన్‌క్రింది బాంబు ప్రేలుస్తున్నాం. అరెస్టులు జరగొచ్చు" అని చెప్పాడు మధ్యవర్తి గణేశ్ శంకర్‌తో అతడా మాటకు బెదరి "వైస్రాయి ఢిల్లీకి రాగానే వలస దేశాలపై ప్రభుత్వ వైఖరిని ప్రకటిస్తారు. మనకు లాభం జరగొచ్చు. ప్రస్తుతానికి మీ కార్యాన్ని వాయిదా వేసుకొంటే మంచిది"— అని ప్రాధేయ పడ్డాడు. చరణ్ అందుకొప్పుకొని 22 అక్టోబర్‌కు ఢిల్లీకి తిరిగివచ్చి యాక్షన్ ప్రస్తుతానికి నిలిపివేసినట్లు తెలిపాడు.

కాంగ్రెసు సంప్రదింపులకూ మనపనికీ సంబంధమేమిటని వాదించాడు యశపాల్. యాక్షన్‌లో పాల్గొనబోతున్నానని చివరి ఫోటో సైతం దిగడము జరిగింది. ప్రమాద కార్యాల్లో పాల్గొనే ముందు ఫోటో తీయడం, అతడు పట్టుబడితే క్యాంపు మార్చడం ఆనావాయితీ నెలరోజులు వాయిదా పడటంతో వెళ్ళి పాతిక బాంబుల వైరుతీసుకు వచ్చారు. మళ్ళీ రహస్యంగా రాత్రివేళ.

ఢిల్లీ విప్లవకారుల ద్వారా చరణ్ నిజాయితీ తెల్సుకొని నవంబర్ మొదటి వారంలో ఆజాద్ ఢిల్లీ కుదిసియా ఉద్యానవనంలో యశపాల్ చరణ్‌ల కల్సుకొన్నాడు. గతాన్ని మరచి పొందని స్నేహహస్తాన్ని అందించాడు. విప్లవ సంస్థతో అంత దగ్గరి సంబంధమున్నా వారిద్దరూ ఆజాద్‌ను చూడటము అదే ప్రథమం. నవంబర్ చివరలో యాక్షన్ నిర్ణయమైంది.



భగత్ కేసులో ప్రభుత్వం తరపున వాదిస్తున్న లాయర్లను చంపాలని తనకు ఉందని ఆజాద్ తెలిపాడు.

ప్రభుత్వ ఉద్యోగులను కాదు ప్రభుత్వ అధికారులనే దెబ్బ తీయడం ప్రయోజనం, అని యశపాల్ అంటే ఆజాద్ అంగీకరించారు.

హంసరాజ్ అనే మిత్రుడు సురక్షితంగా బాంబు పేల్చటానికి వైర్‌లెస్ సెట్ తయారుచేసిస్తానంటే నమ్మటంవలన వీరి నవంబర్ కార్యక్రమం జరగలేదు. 1929 డిసెంబర్ 23 యాక్షన్‌కు నిర్ణయమైంది. అందుకు ఆజాద్ మొదట అంగీకరించాడు కాని తర్వాత వీరిని సమావేశపరచి, అదే 23 నాడు "గాంధీ-ఇర్విన్" ఒడంబడిక ఉంటుంది, 24 నుంచి కాంగ్రెసు సమావేశాయి. నెహ్రూ నాయకుడైతే కాంగ్రెసు దృక్పథంలో మార్పు రావచ్చు. కాబట్టి ప్రస్తుతానికి బాంబు ప్రేల్చడం వాయిదావేద్దామన్నాడు. అది కాంగ్రెసు వారికోరిక కూడా, చరణ్ అంగీకరించాడు. యశపాల్ చర్చ మధ్యలోనే వెళ్ళిపోయాడు.

## వైస్రాయ్ ట్రైన్ క్రింద బాంబు :

ఆజాద్, భగవతీభాయ్‌ల నిర్ణయాన్ని యశపాల్ అంగీకరించలేదు. 1921లో ఇట్లే చేశాడు గాంధీజీ. ఇప్పుడూ స్వతంత్ర్యం ఇచ్చే ప్రకటన చేయాలని ఏడాది గడువిచ్చాడు. గడువు తీరిపోయింతర్వాత చేతనైతే ఉద్యమము ఆరంభించాలి స్వతంత్ర్యం కోసం, కాని-ఈ రాజీ బేరాలేమిటి? కాంగ్రెసు వారి కోరికలను మనం ఆమోదించ వలసిన పనిలేదు. ఏమైనా సరే నేను వినను. తేపకు యాక్షన్ వాయిదావేస్తూ పిరికివాడిగా ముద్రవేసుకోను-అని మొండి కెత్తాడు. చరణ్ అతని పట్టుదలను అంగీకరించాడు.

వాన కురిసి మబ్బుపట్టి మంచురాలే రాత్రి బహు ప్రయాసగా సైకిల్ మోటార్‌పై వెళ్ళాడు. ఇందుకే కొన్నాడు దాన్ని చరణ్. యశపాల్

మిలటరీ ఆఫీసర్‌గా భాగారాం బంట్రోతుగా ఈ భయానక చర్యలో పాల్గొని అనుకున్న సమయానికి బాంబు పేల్చగలిగారు. అదంతా ఓ పెద్ద కథ.



వైస్రాయి భోజనపు కంపార్టుమెంటు ఇరుసు చక్రాలు తప్ప మిగతా అంతా తునాతునకలై ఎగిరిపోయింది. ఆయన పర్సనల్ సెక్రెట్రీ పధకనుంచి ఎగిరిపడ్డాడు. ఒక సిపాయి ముఖం కాలి చచ్చాడు. వైస్రాయి ఇర్వినే కంపించి పోయాడు. న్యూఢిల్లీ చేరగానే పెట్టెను బట్టలతో కప్పి తీసుకెళ్ళారు. వైస్రాయి రైలు దిగుతూనే చర్చికి ప్రార్థనకు పరుగెత్తాడు.

ఇటు తమకోసం గాజియాబాద్‌లో వేచి ఉన్న భగవతీ చరణ్‌నూ కల్సుకొని కలకత్తా రైలెక్కాడు యశపాల్.

అటు గాంధీజీ కాంగ్రెసు సభల్లో విప్లవకారులను తిట్టిపోసి వైస్రాయికి ప్రమాదం తప్పినందుకు సానుభూతి తెలిపాడు. ఆ తీర్మానాన్ని బహు ప్రయత్నంతో ఆమోదింపజేశాడు.

## ఆజాద్ కోపం

పార్టీ ఆదేశాన్ని ధిక్కరించి నందుకు ఆజాద్‌కు కోపం వచ్చినట్లు తెల్సింది. కలకత్తానుంచి ఢిల్లీ తిరిగిరాగానే యశపాల్, చరణ్‌ను ముందుగా వెళ్ళటం తగదని తానే ఆజాద్‌ను కల్సుకున్నాడు. మొదట కోపగించినా పిదవ శాంతించాడు ఆజాద్. ఆయన సంకల్పం ఎంత కఠోరమో హృదయమంతటి మెత్తన.

గాంధీజీ లాహోరు సభల తన ప్రసంగాన్ని "బాంబుమార్గం" పేర "యంగ్ ఇండియా" పత్రికలో ప్రచురించాడు. దానికి జవాబుగా "బాంబుదర్శనం" అనే పేరుతో ఒక కరపత్రం పార్టీపేరుతో ప్రచురించాలని భగవతీ భాయికికోరికగా ఉందని యశపాల్ చెప్పటంతో అతనితోపాటుగా ఆనాడే బయల్దేరాడు ఆజాద్. కలకత్తా నుంచి రాగానే సానిటరీ సప్లయర్‌గా లక్నోలో ఉంటున్నాడు. యశపాల్ భగవతీచరణ్ బహు చర్చలతో సుదీర్ఘ కరపత్రం రచన జరిగింది. రచన చరణ్‌ది. సహాయం యశపాల్‌ది. సలహాలు సంతకం ఆజాద్‌ని. అతడే కాన్‌పూర్‌లో దాన్ని రహస్యంగా ముద్రించి తెచ్చాడు.

## "బాంబు దర్శనం" నుంచి అక్కడక్కడ

"వైస్రాయి మీద బాంబు దాడి జరిగినందుకు కాంగ్రెసుపార్టీ- గాంధీజీ

విప్లవకారుల్ని విమర్శించారు- నిందించారు. వాటికి మేం జడవం. అబద్ధపు ఆరోపణలను సహించం-"

"నిజానికి హింస- అహింస అంటే ఏమిటి? శారీరక బలంద్వారా ఇతరులకు అన్యాయం చేయటం హింస. అహింస తాను కష్టాలు సహిస్తూ ఆత్మశక్తిద్వారా ఇతరులను మార్చాలనుకోవటం-"

"విప్లవకారులు తమ విశ్వాసం ప్రకారం- దేశం కోసం న్యాయం కోసం మానసిక శక్తినేకాక శారీరక శక్తినీ వాడుకుంటున్నారు. త్యాగ గుణంలో ఎవ్వరికీ తీసిపోరు.

"మీ సత్యాగ్రహ మార్గాన్నే మేం ఎందుకు అనుసరించాలి. మేం దేశ స్వాతంత్ర్యం విప్లవం ద్వారానే సాధ్యమనుకుంటున్నాం. విప్లవం అంటే ఒకపర ప్రభుత్వంతో పోరాటం మాత్రమే కాదు. ఈ పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసి వర్గరహిత సమాజాన్ని స్థాపించడం. ఇంకా విదేశీయుల స్వదేశీయుల దోపిడీ నుండి ప్రజల్ని కాపాడటం. వారికి స్వయం నిర్ణయాధికారాన్ని ఇచ్చి దోపిడీదారుల పాలనను అంతంచేసి రైతుకూలీ ప్రజారాజ్యాన్ని రూపొందించడము మా ధ్యేయము."

"దేశంలోని యువకులు నేడు మానసిక దాస్యం నుంచి మత పిచ్చి నుంచి బైటపడి విదేశీ దాస్య బంధాలను తెంచుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. అన్యాయం- దోపిడీకి క్రోధంతో తిరుగబడుతున్నారు. దౌర్జన్యాలకుదిగుతున్నారు. ఇదే విప్లవం కాదు- కాని రాబోయే విప్లవానికి ఇది ఆరంభం. ఇది తప్ప వేరు దారిలేదు. ప్రపంచ విప్లవాలన్నీ దౌర్జన్యంతోనే మొదలైనాయి.

"మరి కాంగ్రెసు లక్ష్యమేమిటి? మొదట సంస్కరణ వాదం. పిదప

స్వరాజ్యమన్నారు. ఇప్పుడు సంపూర్ణ స్వరాజ్యమంటున్నారు. అయితే విదేశీ ప్రభుత్వంతో పోరాడాలి. అలాకాక పర ప్రభుత్వంతో హోరాహోరి పోరాడు తున్న విప్లవకారులను నిందిస్తున్నారు-"

"ఈ దేశానికి శత్రువైన వైస్రాయిని మిత్రుడంటూ, గాంధీజీ—దేశానికి ప్రాణాలను బలిపెట్టుతున్న విప్లవకారులను నిందిస్తున్నారు. గాంధీగారు (బాంబు చర్యకు విరుద్ధంగా) ప్రవేశపెట్టిన తీర్మానాన్ని అలిగి, కోపించి, వెళ్ళి పోతానని బెదిరించి 1713 ప్రతినిధుల్లో కేవలం 81 మెజార్టీతో ప్యాసు చేయించు కున్నారు.అహింసను ఆదర్శంగా స్వీకరించిన కాంగ్రెసు వారే ఇలాగుంటే మిగతా దేశ ప్రజల మాటేమిటి ?"

"ఉపన్యాస వేదికలపై నుంచి తప్ప ప్రజల స్థితిగతులు ఆయనకు తెలియవు. ప్రజలను గాంధీపై మూఢభక్తి ఉంది. అది వారి రాజకీయ సిద్ధాంతాలను అభిమానించి అనుకోవడం పొరపాటు. శత్రువులను ప్రేమించాలనే మంత్రం ఇతర దేశాల వారికి వలెనే వీరికి అర్థంకానిది. ప్రేమించిన వారితో స్నేహం ద్వేషించిన వారితో పోరాటం మానవ సహజ లక్షణం".

"పదేండ్లుగా అహింస ప్రేమలతో పోరాడి గాంధీజీ ఎందరి హృదయా లను మార్చగలిగాడు. ఏ ఒక్కరినీ మార్చజాలనప్పుడు ప్రభుత్వాన్నే మారుస్తా ననడం హాస్యాస్పదం."

"గొప్ప రాజనీతిజ్ఞుల మనుకుంటారు కాని గాంధీ నెత్రహూలను వైస్రాయి కూటనీతి బుట్టలో వేసుకుంది."

"వీరు వద్దన్నా విప్లవకారులకు ప్రజల సానుభూతి తోడ్పాటులభిస్తూనే ఉంటుంది."

"రైతులకు కూలీలకు మేధావులకు మేం ఒక విన్నపం చేస్తున్నాం.

స్వాతంత్ర్య పోరాటంలో మాతో చేతులు కలపండి. అహింస పేరుతో విదేశీ వాస్యానికి తలవంచినన్నాళ్ళు మన సంస్కృతీ సభ్యతలు మక దేశ గౌరవం బుగ్గి పాలవుతాయి. సాయుధ పోరాటంతో సామాజికంగా రాజకీయంగా ఆర్థికంగా జరిగే అన్ని దోపిడీలను అరికట్టి నూతన సమాజాన్ని సృష్టిద్దాం. విప్లవం వర్థిల్లాలి.

కర్తార్‌సింగ్;
కమాండర్ ఇన్ చీఫ్-"

బలరాజ్ పేరుతో ఇంతకుముందు రెండు కరపత్రాలపై సంతకంచేసిన అజాద్ ఈమారు కర్తార్‌సింగ్ పేరు వాడుకున్నాడు.

## హి.సా.ప్ర సేన-క్రొత్త కార్యవర్గం —

1930 జనవరిలో ఆజాద్ కాన్పూర్‌లో విప్లవకారుల సమావేశపరచి సంఘ పరిస్థితులు సమీక్షించి క్రొత్త కార్యవర్గ ఎన్నికలు జరిపించాడు. తాను మొదటి నుంచి నిర్వహించిన రెండు పదవుల్లో అధ్యక్ష స్థానం శేఠ్‌దామోదర స్వరూప్ కిచ్చి తాను సేనానిగా మాత్రమున్నాడు. భగవతీచరణ్ ఆ యిద్దరికీ సంధాన కర్త- ప్రధాన కార్యదర్శి కూడాను. ఈ ముగ్గురు కార్యక్రమ నిర్ణేతలు.

పంజాబ్‌కు- యశపాల్, యు.పి.కి- వీరభద్రతివారీ, ఢిల్లీకి- కైలాసపతి, కార్యకర్తలు. ఇతర ప్రాంతాల కార్యకర్తలకు ఈ వివరాలు తెలిపారు. మహారాష్ట్ర, బెంగాళ్ క్రాంతికారులు తమతో చేరుతారని ఆశించారు.

పార్టీకి ఒక సొంత ప్రెస్సు సంపాదించాలని, ఒక ప్రచార సంస్థ నేర్పరచి ఉద్యమ సానుభూతిపరులను పెంచాలని, ఆర్థికంగా సంస్థకు బలం సమకూర్చాలనీ అనుకున్నారు. బాంబు దర్శనం కరపత్రాలు అదే నెలలో ఒకే తేదీన 26 జనవరి, కాంగ్రెసువారి స్వరాజ్య దినాన దేశమంతటా పంచే ఏర్పాట్లు ఈ సభలోనేచేసుకున్నారు.

భగత్, దత్తు మొ॥ విప్లవ మిత్రులను విడిపించడం సంస్థ తీసుకున్నది మొదటి నిర్ణయం.

## బాబా సాహెబ్ కోరిక

ప్రసిద్ధ విప్లవకారుడు వినాయక సావర్కార్ సోదరుడు బాబా సావర్కార్ కాన్పూర్ అర్జునీ కార్యాలయానికి వచ్చినప్పుడు యశపాల్, భగవతీచరణ్ వెళ్ళి కల్సి నమస్కరించి అతని సహాయాన్ని అర్థించారు. ఆయన వ్రాసిన "అండమాన్ ప్రతిధ్వని" వీరిని ఉత్తేజ పరచిన పుస్తకం.

ఆయన మాట ప్రకారం యశపాల్ "అకోలా"కు వెళ్ళి అతన్ని ఇంటి వద్ద కల్సుకున్నాడు. కట్టు, బొట్టు, భాష, టీ కూడా (తులిసాకు కషాయం) అంతా స్వదేశానే అభిమానిస్తున్నాడాయన. దేశ స్వాతంత్ర్యమే కాదు, సంస్కృతినీ పరిరక్షించుకోవడమూ ప్రధానం, క్రైస్తవులే కాదుముస్లింలూ తన శత్రువులని తనఅభిప్రాయం తెలిపాడు.

ముస్లింలీగు అధ్యక్షుడు మహమ్మదాలీ జిన్నాను చంపితే 50 వేల రూపాయలు ఇవ్వగలనన్నాడు. ఆ సమయంలో డబ్బు చాలా అవసరముగా ఉంది సంస్థకు. అయినా యశపాల్ ఆ కోరికను త్రోసిపుచ్చారు. దేశంలో మత కల్లోలం సృష్టించడం నచ్చక.

అతడిచ్చిన నాటు తుపాకి వద్దని, చార్జీల కిచ్చిన పదిరూపాయలు తీసుకొని నమస్కరించి వచ్చాడు.

"ఆయన మనల్ని కూలీకి హత్యలుచేసే గూండాల మనుకున్నారా?" అని బాధపడ్డాడు చరణ్ ఆ వార్తవిని.

ఆత్మవత్ సర్వభూతాని- అని భోధించే హిందూ మతధర్మం ఎటు పోతున్నది అనుకున్నాడు యశపాల్.

ప్రకాశవతి—

భగత్‌ను విడిపించే యత్నంలో ఇంద్రపాల్ ద్వారా ఒక యిల్లు పార్టీకి అద్దెకు తీసుకొని లాహోర్‌కు మారాడు యశపాల్. ప్రేమవతి అనారోగ్య పడి లాయల్‌పూర్ వెళ్ళింది. ఆమెద్వారా పార్టీకి పరిచయమై సహకరించే ప్రకాశ వతి సోదరుడు ప్రేమనాథ్‌తో సహా ఒకనాడు యశపాల్ దగ్గరికొచ్చింది. ఆమెకు పార్టీతో ఉన్న సంబంధం తెల్సి పెళ్ళిచేయ నెంచాడు తండ్రి. పెళ్ళిని తండ్రిని ఎదిరించి ఇంటినుంచి వెళ్ళి వచ్చిందామె. అప్పుడు భగవతీ చరణ్‌కూడా అక్కడే ఉన్నాడు.

కొన్నాళ్ళ క్రితం ఆమె ఇంటినుంచి వెయ్యి రూ॥ దొంగిలించి సోదరునితో పంపిస్తే అతడు పోగొట్టినందుకు చాల బాధపడింది.

నచ్చని పెళ్ళి చెయ్యకుండా మీ నాన్నకు చెప్తుతాం ఇంటికి తిరిగి వెళ్ళటం మంచిదని యశపాల్ చెప్పిన వినక ఆమె అక్కడే ఉండి పోయింది.

విప్లవకారుల రద్దీ పెరగడంతో "మరో ఇల్లుకూడా అద్దెకు తీసుకున్నారు. లాహోరులో మిగిలిన వాళ్ళకు తోడుగా విశ్వంభర్, సుఖదేవరాజ్, ప్రేమనాథ్ మొ॥ కొత్తవాళ్ళు చేరారు.

ప్రకాశవతి మిడిల్, హిందీరత్న మాత్రం చదివింది. ఇప్పుడుచరిత్ర భూగోళం ఆంగ్లం చదువుతున్నది.

ఇక్కడ పార్టీపని కార్యకర్త రద్దీ పెరగడంతో ప్రకాశవతిని తమ దగ్గరకి పంపితే బాగుంటుందని సుఖదేవరాజ్ అడిగాడు. ఆమెకు ఢిల్లీ కృష్ణజీ అనే అభిమాని ఇంటికి పంపాడు. యశపాల్ బాగా ఆలోచించి, తాము "యాక్షన్" లో పాల్గొంటే ఆమెకు కొత్త ఆశ్రమం అవసరమని యెంచి.

కొన్ని రోజులకు ఆమె అక్కడ ఉండనని యశపాల్ వద్దనే ఉంటానని పట్టుపట్టింది. పార్టీకోసం జైలుకు దగ్గరగా తీసుకున్న భాగాల్లో సంసార

పక్షంగా కన్పించటానికి పోలీసుల దృష్టి తప్పించటానికి స్త్రీలు ఉండవలసి వచ్చి దుర్గాదేవికి తోడు ప్రకాశవతిని పిలిచారు. ఆమెకు మెలకువగా మెదలే నేర్పులేదని ఢిల్లీకి పంపి సుశీలను పిలిచారు.

## తల్లి దీవెనలు

ఆ రోజుల్లో ఇంద్రపాల్ ఇంటి ప్రక్కఇంటి స్త్రీ ధనదేవి, యశపాల్ తల్లి ప్రేమదేవికి మిత్రురాలు. ఆమె పోలీసుల దృష్టినుంచి కాపాడి తల్లీకొడుకు కల్సుకునేలా చేసింది.

ఆమె అప్పుడు ఉద్యోగం చేస్తూలేదు. చిన్నకొడుకు కరెంటు ఉద్యోగం పని మానివేసి లాహోరు కుట్రకేసు వాళ్ళకు సహకరిస్తూ తిరుగుతున్నాడట. ఏ గూటి చిలుకకాగూటి పలుకు. తండ్రి ఇతడు ఇంటర్‌లో వుండగానే చనిపోయాడు. స్థితిగతులన్నీ బాధగా వివరించిందామె పెద్దకొడుక్కు.

"సొంత తల్లిని గూర్చి అందరూ ఆలోచిస్తారు. దేశమాతను గూర్చి కొందరైనా ఆలోచించాలి కదా అమ్మా, భగత్, సుఖదేవ్‌లు కూడా ఒక తల్లి కన్నబిడ్డలే కదా. దేశం కోసం జైళ్ళతో మగ్గుతున్నారు. నేనేమీ చెడ్డపని చేస్తూలేను. దేశ విముక్తికోసం ప్రయత్నిస్తున్న, చిన్నప్పటి నుంచి సత్యం పలుకుమని, ధీరత్వంతో మెదలుమని బోధించిన మీవారికే అమలు పరుస్తున్నాను" అన్నాడతడు.

ఆమె కన్నీరు తుడుచుకొని నవ్వటానికి ప్రయత్నిస్తూ, "సరే! తల్లి పాలకు అవమానం తెచ్చేపని మాత్రం చేయకు" అని వెళ్ళిపోయింది. మాతృ హృదయం సంతానం క్షేమాన్ని కోరుతుంది- సహాయాన్ని ఆశిస్తుంది. వీలు కానప్పుడు విచారాన్ని గుండెలోనే భరిస్తుంది.

# భగత్ విడుదల కాలేదు- భగవతే దూరమయ్యాడు-

భగత్‌సింగ్ దత్తులను విడిపించే కార్యక్రమాలు చురుకుగా సాగుతున్నవి. ముందుగా షేర్‌దిల్ సిపాయిలను ఎదిరించి ఆయుధాలు సమకూర్చుకుందామని తర్వాత జైలు దాడి అనే యశపాల్ కోరికను చరణ్ త్రోసిపుచ్చాడు.

భగత్‌సింగ్ "కళాకారుణ్ణి రోజుకో క్రొత్త ఆలోచన చేయకుమనండి. ఓ ఘనకార్యం చేశాడు కదా. కొన్నాళ్ళు విశ్రాంతిగా కవిత్వం వ్రాసుకొమ్మనండి. ఆజాద్‌ను ముందుంచి మొదట మమ్మి విడిపించండి" అని అందుకు ప్లానుకూడా వ్రాసి పంపాడు.

యశపాల్ వేరే ప్లాను ఆలోచించాడు కాని, ఆజాద్ భగత్ ప్లానునే ఆమోదించాడు. జూన్ ఒకటవ తేదీ యాక్షన్‌కు నిర్ణయమైంది. యశపాల్, భగవతీచరణ్ ఇద్దరూ పోటీపడుతున్నారు జైలుదాడిలో పాల్గొనటానికి. ఆజాద్ స్వయంగా పాల్గొన నెంచాడు. ఆ ఇద్దరులో ఒక్కరు ఆగిపోవటం ఖాయం.

అదే ఉద్దేశ్యంతో యశపాల్ ప్రకాశవతిని ఢిల్లీ పంపించే ముందు "నేను భగత్‌ను విడిపించే యాక్షన్‌లో పాల్గొంటాను. తిరిగి రాకపోవచ్చు కూడా. దాడిలో పాల్గొనకపోతే భగవతీభాయి ఉంటాడు. కైలాసపతి ఉంటాడు" నీకు తోడ్పడుతారు అన్నట్లు చెప్పి "నన్ను జ్ఞాపకం ఉంచుకుంటావా ?" అన్నాడు చివరగా.

"నేను వచ్చి మిమ్మల్నే కలుస్తాను" అందామె. అతనికి తృప్తిగానే ఉందా జవాబు. వారి ప్రేమను వ్యక్తీకరించంది. కాని ఆ మాటలే తర్వాత నిందకు కారణమైనవి, విప్లవకారుడి ప్రవర్తనకు తగిలేవని. ఆదర్శం వేరు అనురాగం వేరు కదా !

ఇంతకుముందే ఓ మారు ప్రకాశవతిని ఎక్కడ ఉంచడమూ అని

ఆలోచించే సందర్భంలో "నువ్వావిమెను పెళ్ళి చేసుకోవయ్యా మరిదీ! సమస్య తీరిపోతుంది" అంది దుర్గాదేవి నవ్వుతూ. చరణ్ కూడా ఉన్నాడు.

"నువ్వు చాల కఠినురాలివి వదినా!" అన్నాడు యశపాల్. కాని ఆ మాట ప్రభావమే ఆమె యెడ అతని శ్రద్ధను పెంచింది. ఆమె ప్రవర్తనఅందుకు తోడయింది.

28 జూన్ 1930 ఆజాద్ కారు పరీక్షించడానికి ధన్వంతరితో కల్సి వెళ్ళాడు. సుఖదేవరాజ్, వైశంపాయన బచ్చన్‌లతో కల్సి భగవతీ చరణ్ కొత్తగా మందుకూరిన బాంబు పరీక్షకు రావి నదీ తీరంలోని అడవికి వెళ్ళాడు.

జైలుదాడి తర్వాత మిత్రులు దాగిఉండే ప్రదేశాల ఏర్పాటు కోసం సైకిల్‌పై వెళ్ళి 3 గం॥కు ఇంటికి వచ్చి అన్నం తింటున్నాడు యశపాల్. చైల్ బిహారీ, మదన్ గోపాల్, ఇద్దరు స్త్రీలు మాత్రమే ఉన్నారప్పుడు.

ఇంతలో కాలిదెబ్బతో సుఖదేవరాజ్ గుర్రపు బండిపై వచ్చాడు. వీళ్లు వెళ్ళి అతన్ని చేతులపై లోపలికి తెచ్చారు. బాంబు విసరటానికి ముందు చేతిలో ప్రేలి తీవ్రంగా గాయపడ్డాడు భగవతీ భాయి అనే వార్త వినిపించాడు. పిడుగుపడి నట్లయిందక్కడ.

యశపాల్, బిహారీని తోడు తీసుకొని ప్రమాద స్థలానికి పరుగున వెళ్ళాడు. ఘోరంగా గాయపడి కొన ఊపిరితో ఉన్నాడు భగవతీ చరణ్. అయినా ధైర్యం చెడలేదు. భగత్‌ను విడిపించే యత్నం మానకండన్నాడు.

యశపాల్ బచ్చన్‌తోపాటు వచ్చి క్రిస్టియన్ కాలేజీ హాస్టల్ మిత్రులు దేవరాజ్, హీరానంద్ దగ్గరి మంచం దుప్పటి తీసికొని తిరిగి టాక్సీపై వెళ్ళాడు. అప్పటికే అంతా అయిపోయింది. విచారంతో బంగ్లాకు తిరిగి వచ్చాడు. శ్మశాన నిశ్శబ్దమలుముకుందక్కడ ఆ వార్తతో దుర్గాదేవి కుప్పలా కూలిపోయింది.

ఆజాద్, బచ్చన్, యశపాల్ చీకటితోనే వెళ్ళి భగవతీభాయి శవాన్ని దుప్పటిలో మూటకట్టి నదిలో వదిలేశారు.



ఏటికి ఎదురీదడమే ధీరగుణం కన్నీటికి వెతజెందడమే పిరికితనం! అనుకున్నట్లు భగత్‌ను అతని సహచరులను విడిపించడానికి సెంట్రల్ జైలునుంచి వారిని బ్రోస్టల్ జైలుకు మార్చేటప్పుడు వెళ్ళారు. కాని ప్రయోజనం లేని ప్రమాదాన్ని గమనించి ఆజాద్ యాక్షన్‌ని నిలిపివేశాడు.

# యశపాల్ ను చంపాలని ఆజాద్ నిర్ణయం :

ప్రకాశవతితో యశపాల్ ప్రవర్తన బాగాలేదు; పార్టీ సొమ్మును దుర్వినియోగ పరుస్తున్నాడు అని ఆజాద్‌ను నమ్మకంగా తెల్సింది. పార్టీని కాన్‌పూర్‌లో సమావేశ పరచి యశపాల్‌ను కాల్చే నిర్ణయం తీసుకొని ఆ బాధ్యతను వీరభద్ర తివారీకి ఒప్పగించారు. అతనికి మిత్రుని నిజాయితీ తెల్సుకాబట్టి ముందుగా చెప్పేశాడు. అనుకొని పరిణామానికి ఆశ్చర్యపడ్డాడు యశపాల్. చక్కగా వెళ్ళి ఆజాద్‌నే అడిగాడు తాను చేసిన నేరమేమిటని, విన్నానంటే విచారణ జరుపకొండానే ఇంత కఠోర నిర్ణయం తీసుకొంటారా, అనడానికి సిద్ధంగా ఉన్నాడు యశపాల్.

నీకెలా తెల్సింది విషయం? అనేది ఆజాద్ ప్రశ్న.

మిత్రుని పేరు బయటపెట్టలేదు యశపాల్.

యశపాల్ దోషికాక పోవచ్చుననే అనుమానం ఆజాద్‌కు ఉన్నా నేరారోపణ చేసిన సుఖదేవరాజ్, ధన్వంతరీ, కైలాసపతి ఒత్తిడి తీవ్రంగా ఉంది. అప్పుడు పార్టీ కేవలం ఆజాద్‌పై అభిమానంతోనే నిలచివుంది. ఎవరినీ నమ్మలేని పరిస్థితి ఆజాద్‌కెదురయ్యింది. నమ్మినవారే విశ్వాస ఘాతకులు కావటంవలన బాధవేసింది. ఎవరిని ఏమనలేని స్థితి ఏర్పాడి దానికి పరిష్కారంగా ఢిల్లీలో కార్యకర్తల సమావేశపరచి పార్టీని రద్దు చేశాడు.

విద్రోహులు దెబ్బతీయజూచినా, విశ్వాసపాత్రుల ద్వారా పార్టీ జీవించే ఉంటుంది. ఇంత మాత్రానికే సంస్థను రద్దుచేయవద్దు-అని సుశీలాదేవి కోరినా ఆజాద్ అంగీకరించలేదు.

తన సహచరులకందరికీ ఆయుధాలు పంచియిచ్చి, ఎవరికి తోచిన విప్లవ చర్యలు వారు చేయండని, ఎవరికి కావల్సి వచ్చినా తన సహాయం అందిస్తా

నన్నాడు భైయ్యా, అందరి ధ్యేయం ఒక్కటే-పర ప్రభుత్వాన్ని దెబ్బతియడం, స్వరాజ్యాన్ని సాధించడం.

అప్పుడు ఏ ప్రాంతానికి ప్రత్యేక కార్యకర్త కాకపోయినా విప్లవకారుడనే కారణంగా యశపాల్‌కు కూడా మిగతా వారితో సమానంగా ఆయుధాల వాటా ఇచ్చాడు. అందుకు ఆజాద్ నెవ్వరూ వ్యతిరేకించలేదు. అతని విలువ అటువంటిది.

"సోహన్! నువ్వు నాతో ఉండు. మనమిద్దరం కల్సి ఏదైనా చేద్దాం" అని కోరాడు పండిత్‌జీ, మిత్రునిపై అతని అభిమానమంతటిది.

ప్రకాశవతి, యశపాల్‌లతో కల్సి మొదట కాన్పూర్‌లో ఆ తర్వాత అలహాబాద్‌లో ఉన్నాడు. లక్నొది స్థిరనివాసం.

## విప్లవ చర్యలు :

సెప్టెంబర్ 1930లో పార్టీ విచ్ఛిత్తి జరిగిన తర్వాత, ధన్వంతరీ, సుఖ దేవరాజ్ లాహోరు కాలువ ఒడ్డున అబ్దుల్ అజీజ్‌ను కాల్చి (కేవలం గాయపరచి) తప్పించుకు పారిపోయారు. "ప్రాణరక్షణ విషయంలో శ్రద్ధపెట్టుకొంటే కార్య సాఫల్యం కష్టం" అన్న యశపాల్ మాట నిజమయ్యింది.

మరోమారు వైస్రాయిపై బలమైన దాడి చేయాలని భైయాకోరిక అతని కోరికతో యశపాల్ ఢిల్లీ వెళ్ళి ఒక ఇల్లు అద్దెకు తీసుకొని "హిమాలయన్ టాయిలెట్స్ పేరుతో బాంబుల తయారీ ఆరంభించాడు. అజ్ఞేయ్, ప్రకాశవతి, కైలాసపతి అతనితో ఉన్నారప్పుడు.

29లో భక్తిపరుడైన వైశ్యుడుగా బృందావన్ వెళ్ళిన సందర్భంలో జుగల్‌కిశోర్ స్నేహంతో ఆచార్య కృపాలానీ పరిచయం అయ్యింది. అప్పుడు బోసుబాబుతోనూ మాట్లాడాడు.

ఇప్పుడు మధురలో కృపాలానీ సాయాన్ని కోరితే విప్లవ కార్యాలకు కాదని సొంత అవసరాలకని 2, 3 వందలు మాత్రం ఇచ్చాడు.

19 సెప్టెంబర్ 1930 తేదీన సెషన్ 302/102 B. IRC క్రింద, ఢిల్లీ కుట నిందితులకు బహుమతులు ప్రకటిస్తూ భారత ఆంగ్ల ప్రభుత్వం ఒక ప్రకటన (పత్రాలు) వెలువరించింది.

అందులో యశపాల్ తండ్రి హీరాలాల్ ఖత్రీ, కాంగ్రా, నివాసం లాహోర్ వయస్సు 23-26, పట్టుకున్న వారికి 3 వేలు ఇస్తామని ఉంది. లేఖారాం, హిస్సార్, శాంపురన్‌సింగ్ (ఆసఫ్) ఢిల్లీలకు 15 వందలు చొప్పున, బిష్యంబర్ దయాల్‌కు ఒక వెయ్యి, హజరీలాల్‌కు 8 వందలు, భవానిసింగ్, భవానీసాహీ (అల్వార్ స్టేట్), కాశీరాం (యు.పి.), ప్రకాశదేవి a was సరళ, వయసు 18సం. వీరికి 500 చొప్పున, రామచంద్ర శర్మకు 300 ప్రకటించారు. యశపాల్ స్థానం ఎంతటిదో దీనితో వ్యక్తమవుతుంది. విప్లవకారులందరూ 20-30 మధ్య వయస్సు యువకులు కావటం విశేషం. వృద్ధ రాజకీయాలు శాంతిమార్గానికి తలనొగ్గినయ్. ప్రకాశవతి పేరు ఇందులో దేవిగా ఉంది. ఆమె పార్టీ పేరు సరళకాదు, కమల-రాణి.

ఆజాద్ కోరగా హంసరాజ్ వైర్‌లెస్ సాయం పొందాలని యశపాల్ వెళ్తూ, బృందావన్ మనోహర్‌లాల్ ప్రేం విద్యాలయంలో ప్రకాశవతి నుంచి వెళ్ళాడు. లాయల్‌పూర్‌లో రాజ్ లేక కరాచీ వెళ్ళి పనికాక ప్రమాదం తప్పుకొని వచ్చి కృష్ణజీ ఆతిథ్యం పొందాడు ఢిల్లీలో. కాన్‌పూర్ వెళ్ళి గుల్జారీలాల్ ఇంట్లో ఆజాద్‌ను కలిశాడు. ఆయనకు అభిమానులెక్కువ.

అక్టోబర్ చివర కైలాసపతి అరెస్టు జరిగింది. బాబురాం సాయినీ,

ఖయాలీరాం గుప్త, గిరివరసింగ్, విమల్ అప్పుడు పట్టుపడ్డారు. చాందినీచౌక్ ఢిల్లీలో కాల్పులు జరుపుతూ ధన్వంతరి పట్టుబడితే వెంటవున్న సుఖదేవరాజ్ పారి పోయాడు.

ఢిల్లీ ప్రమాదంగా మారి యశపాల్ కాన్పూర్ చేరి, గంగ ఒడ్డుగా మున్షీరాం అధ్యాపకునింట ఆగాడు ప్రకాశవతితో పాటుగా. లాహోర్ కాలేజీ మిత్రుడు చౌదరీ రాంధన్‌సింగ్ అప్పుడు కాన్పూర్ గౌట్ లెదర్ స్కూల్లో ట్రైనింగ్ పొందుతున్నాడు. అతని సాయంతో చున్నీగంజ్‌లో ఓ అద్దె యింటికి మారాడు యశపాల్. ప్రకాశవతి వెంటే ఉంది. ఆజాద్ తరచు వారితో గడుపుతూ భావి ఆలోచనలు చేసేవాడు. ప్రకాశవతికి పిస్తోలు గురి, ఆంగ్లం నేర్పేవాడు. స్త్రీలంటే గౌరవం భైయ్యాకు. విప్లవకారులకు ప్రజల గౌరవం లభించేది కాని కాంగ్రెసు- కమ్యూనిస్టు వారికి వలె పెద్ద మొత్తాల్లో సాయం లభించేది కాదు. కాంగ్రెసు వ్యతిరేక ప్రచారం, ప్రభుత్వం వల్ల భయం అందుకు కారణాలు. అభి మానులు ఇచ్చే వందాయాభైలతో కాలం కష్టంగా గడవసాగింది. విప్లవ చర్యలకు డబ్బు చాల అవసరమయ్యేది.

దోపిడీ తప్పనిదయ్యింది. కైలాసపతి అరెస్టుతో అజ్మీర్‌లో మదన్ లాల్ సాయంతో చేయాలనుకున్న దోపిడీ ఆగిపోయింది.

మనీ యాక్షన్ కోసం ఏర్పాటు చూడవల్సిందిగా వీరభద్ర తివారీని కోరాడు ఆజాద్. కాన్పూర్ నయాగంజీలోని ఒక చర్మ వ్యాపారిని దోస్తే 40, 50 వేలు సునాయాసంగా దొరుకుతాయని చెప్పి తివారీ దాడి రోజే అరెస్టయ్యాడు. అయినా ఆజాద్ తన పని మానుకోలేదు. సురేంద్రపాండే, శాలిక్‌రాం శుక్లలతో పాటు మూడు సైకిళ్ళపై వెళ్ళి పట్టపగలు సాహసంగా ఆ వ్యాపారిని దోచాడు. ఇంతకూ దొరికిన డబ్బు పదకొండు వందలు మాత్రమే!

ఢిల్లీలో విప్లవ కేంద్రం ఏర్పాటు చేయాలని నందకిశోర్ నిగంను పిలిపించాడు. భైయా కోరికగా సంప్రదింపులకు పార్టీతోవస్తూ శాలిక్‌రాం శుక్ల పోలీసులు చుట్టుముట్టగా వీరోచితంగా పోరాడి మిత్రులకు Beware జాగ్రత్తగా ఉండండని హెచ్చరించి మరణించాడు.

కాన్పూర్ నుంచి అలహాబాద్ మారాడు యశపాల్. హిందీ విద్యాపీఠ్ నిర్వాహకుడు బలదేవ్ చౌబే వారికి ఆశ్రయమిచ్చాడు.

ఆ అక్టోబరులో లాహోరు కుట్రకేసులో భగత్ సహచరులకు శిక్షలు ప్రకటించబడ్డాయి. ఆజాద్ వ్యగ్రుడై నాడు. అందుకు ప్రతీకారంచేయ సంకల్పించాడు. ఉత్తర భారతం కల్లోలంగా ఉంది. విప్లవకారులకు అనుకూలంగా లేదు. దక్షిణానికి మారాలని నిర్ణయించుకున్నాడు.

ధన్వంతరి ద్వారా బొంబాయి పృధ్వీసింగ్‌ను పిలిచి ప్రయాగ ఆల్ఫ్రెడ్ పార్కులో కలిశాడు. 1915 గదర్ కుట్రకేసు దోషిగా అండమాన్ ద్వీపాంతర వాస శిక్షపడింది. పృధ్వీసింగ్‌కు రాజమండ్రి జైలునుంచిఅమరావతికి మార్చబడుతూ నాసిక్‌లో రైలునుంచి దూకి తప్పించుకొనిగుజరాత్‌లోస్వామిరావు పేరఅతడురహస్య జీవితం గడుపుతున్నాడు. ఇప్పుడు ఆజాద్ కోరికగా విప్లవోద్యమానికి సహకరించడానికి అంగీకరించాడు. విప్లవ కార్యాల్లో పాల్గొనాలని దుర్గాదేవి కాన్పూరు వచ్చి ఆజాద్‌ను చేరింది. ప్రభుత్వంమీది కసితో పంజాబ్ గవర్నర్‌ను కాల్చాలనిఉంది. వైస్రాయిని సరేసరి. ప్రస్తుతానికి బొంబాయి గవర్నరును (ఆంగ్ల ప్రభుత్వమంటేనే ద్వేషం) కాల్చేయాలనుకున్నారు. అందుకు సిద్ధపడి దుర్గాదేవి పృధ్వీసింగ్ సాయంతో బొంబాయి చేరింది. శచీంద్రను బాబాసాహెబ్ వద్ద ఉంచింది. సుఖదేవరాజ్ వెంట వెళ్ళాడు.

బాప్టే అనే మిలిట్రీ డ్రైవర్ తోడు పడ్డాడు. అడిగి తెచ్చిన కారులో వెళ్ళారు. గవర్నర్ భవన ప్రవేశానికి వీలు చిక్కలేదు. వృధాగా రావటం నచ్చక

లై మింగ్‌టన్ రోడ్‌లో ఒక ఆంగ్ల పోలీసు సార్జంటును అతని ప్రేయసిని చూసి పృధ్వీసింగ్ "ఫయర్" అనగానే దుర్గాదేవి, సుఖదేవరాజ్ కాల్పులు జరిపారు. ఆ పురుషుని కాలిపిక్కను, స్త్రీ భుజానికి గాయాలైనై. వెంబడించే ఆంగ్ల రక్షక భటుల్ని తప్పించుకొని విడిదికి చేరారు. దుర్గాదేవి శచిని తీసుకొని కళ్యాణివరకు కారుపై వెళ్ళి ఝూన్సీ రైలెక్కి మారి కాన్పూరు చేరింది.

నవంబర్‌లో హంసరాజ్ కోసము మరోసారి కరాచీ వెళ్ళాడు యశపాల్.

వీరభద్ర తివారీపై అనుమానము నచ్చికాల్చివేసే నిర్నయంతో యశపాల్‌తో వెళ్ళాడు ఆజాద్. తివారీ వీరికి చిక్కలేదు.

డిసెంబర్ చివర్లో లాహోర్ యూనివర్సిటీ కాన్వొకేషన్‌లో పంజాబ్ గవర్నర్‌ను చంపాలని కాల్పులు జరిపాడు నూతన వీరుడు హరికృష్న గవర్నర్ గాయపడ్డాడుకాని మరో పోలీసు ఇన్స్పెక్టర్ ఆ కాల్పుల్లో మరణించాడు. హరికృష్న పట్టుబడ్డాడు. ఆ చర్యవల్ల కృష్నతోపాటు రణవీర్, దుర్గాదాస్‌లు ఉరి తీయపడ్డారు.

కుందన్‌లాల్, బన్సీలాల్, యశపాల్ తమ్ముడు ధర్మపాల్ బందీ కావించబడి చిత్రహింసలు పాలైనారు. ఇంద్రపాల్ ప్రభుత్వ సాక్షిగా మారినా తర్వాత ప్లేటుమార్చి పోలీసుల హింసవల్ల అలా చెప్పానన్నాడు.

ఆజాద్ కోరికగా రష్యా వెళ్ళటానికి సహాయంఅర్ధించటానికి జవహర్‌లాల్ నెహ్రూ దగ్గరికి వెళ్ళాడు. (3-2-31నాడు) యశపాల్‌తమ విప్లవమార్గాన్ని బలపరుస్తూ కాంగ్రెసు శాంతివాదం మీద తమకునమ్మకంలేదనిస్పష్టంగాచెప్పేశాడు. అందుకు అంగీకరించకపోయినా ఆ తర్వాత 1500రూ॥ పంపించాడు నెహ్రూ 12 ఫిబ్రవరినాడు యశపాల్ ప్రయాణం 28 ఫి.న నిర్నయమైంది. వద్దన్నా 500రూ॥

ఆజాద్ జేబులో పెట్టి మిగతా వెయ్యి తానుంచుకున్నాడు. 27 ఫిబ్రవరి 1931 ఉదయం తన ప్రయాణపు సామాగ్రి కొనడానికి యశపాల్, పాండేతోసహా బజారుకు వెళ్ళగా, తానూ ఒక మిత్రున్ని ఆల్ఫ్రెడ్ పార్కులో కలవవల్సిఉందనే భైయ్యా వారివెంట సైకిల్‌పై బయల్దేరాడు. దారిలో సుఖదేవరాజ్ కనిపించడంతో వారిద్దరు కల్సివెళ్ళారు. యశపాల్ దుకాణంలో సామానుకొంటూ ఉండగానే, పార్కులో క్రాంతికారులకు పోలీసులకు భీకరంగా పోరాటం జరుగుతున్నదనే వార్త చేరింది. ఒక క్రాంతికారి వీరమరణం చెందాడని తెల్సింది. యశపాల్ గుండెల్లో పిడుగుపడినట్లయింది. ఉద్వేగంతో ముందుకు పరుగెత్తబోయాడు. మిత్రుని నాయకుని దగ్గరికి, సురేంద్ర పాండే ఆపాడు. రాబోయే ప్రమాదాన్ని గమనించి, అయినా చుట్టూగా తిరిగి అటు వెళ్ళాడు మరికొంత సేపటికి.

తోట గేటువద్ద పెద్దగా గుమిగూడిన జనం, చుట్టూ పోలీసుల కాపలా, అమరత్వం చెందాడు చంద్రశేఖర్ ఆజాద్. శక్తి ఉన్నంతవరకు శత్రుబలగాల్ని కాల్చి చివరిగుండు తన కణతలో కాల్చుకొని మాతృభూమి ఒడిలో పడిపోయాడు.

విప్లవకారులకు కొండంత అండ దూరమయింది. ఈ వార్త విని ప్రకాశవతి స్తబ్ధురాలై ఆపై మిక్కుటంగా యేడ్చింది. తన రష్యా ప్రయాణాన్ని మానుకున్నాడు యశపాల్.

1931 మార్చి 23వ తేదీన భగత్‌సింగ్, రాజగురుసుఖదేవ్, లాహోరు జైల్లో ఉరితీయబడ్డారు. మీరట్‌లో విన్నాడా విషాదవార్త. మిత్రులు ఆత్మబలి దానానికి భిన్నుడయ్యాడు పాల్. అయినా విప్లవకారులను సంఘటిత పరచడానికి వివిధప్రాంతాలకు తిరుగుతూ పరిశ్రమిస్తున్నాడు. నిదానం ఢిల్లీకి మార్చాడు చాందినీ చౌక్‌లోని ఓ సందులోని ఇంటిలో అద్దెకున్నాడు.

ఢిల్లీలో కృష్ణజీ వలన సుమిత్రాదేవి-ప్రభుదత్తుల పరిచయం కల్గింది.

ఢిల్లీ ఆందోళన కారుల గరష్ఠారి తీవ్రమైంది. క్రాంతికారులు పలువురు

మరణించారు-అనేకులు బందీలైనారు. మిగిలిన వారిలో యశపాల్ ముఖ్యుడు. వీరిని పట్టుకోవటానికి పెద్దమొత్తంలో బహుమతులు ప్రకటించి రైల్వేస్టేషన్లలో, పోస్టాఫీసుల్లో, ప్రధాన కూడలులలో గోడపత్రాలు అంటించబడినై, యశపాల్ దాగుకోలేదు. తన ఉద్యమకార్యాలు విరమించలేదు. ప్రభుత్వం స్కాట్‌లాండ్ సి.ఐ.డి.లు రావించినా పట్టుపడలేదు. కొద్దిపాటి విషం మార్పుతో తిరుగుతూనే ఉన్నాడు. కృత్రిమంగా గడ్డాలు మీసాలు ఎప్పుడూ వాడలేదు!

పార్టీని బలపరచడానికి కాన్‌పూర్ సురేంద్ర పాండెను కలవడానికి వెళ్ళాడు. మీటింగ్ కాకముందే పోలీసులు కాశీరాం-రాజేంద్ర నిగంలను అనుమానించి వెంబడించడంతో కాల్పులు జరిపి నలుగురిలో ఇద్దరిని తీవ్రంగా గాయపరచి తప్పించుకొని వచ్చాడు.

జాపడ్‌లో జరిగిన సమావేశంలోనూ సయోధ్య కుదర్లేదు. రష్యాకు వెళ్ళి విప్లవాన్ని అధ్యయనం చేయాలని, వీలయితే ఆ ప్రభుత్వ సహకారము పొందాలని భావించి, సుమిత్రాదేవి సాయంకోరాడు. ఆమె ఆర్థికంగా సహకరిస్తానంది కాని అప్పుడు విశ్రాంతి కోసం మసూరిలో ఉండి వీరినీ కొంతకాలం తమతో ఉండి పొమ్మంది. యశపాల్ ప్రకాశవతి అక్కడ కొన్నాళ్ళు హాయిగా గడిపారు.

ఆ కాలంలోనే, ఆస్కార్ వైల్డ్, లుయీఫిషర్ ఆంగ్ల రచనలు హిందీ చేశాడు. పబ్లిషర్లుకోరగా, కొంత డబ్బుకూడా అందుకు వచ్చింది. విప్లవమిత్రులు కొందరతనికి తోడ్పడ్డారు. కొందరు దుష్ప్రచారం చేశారు. కొందరు వీరికని చందాలు ప్రోగుచేసి వారే వాడుకొన్నారు.

ఆ తర్వాత గఢముక్తేశ్వరంలో క్రాంతికారుల సమావేశం జరిగింది. పాండే ఆఫీసు నిర్వాహకుడుగా, యశపాల్ కమాండర్-ఇన్-చీఫ్‌గా ఎన్నికైనారు. స్వతంత్రులుగా వ్యవహరిస్తూనే పరస్పర సహకరించుకొంటూ గెరిల్లా పోరాటంతో ప్రభుత్వాన్ని దెబ్బతీయాలని యశపాల్ మిత్రులకు హెచ్చరించాడు. ఒక కరపత్రం సైతం ప్రచురించాడు తన సంతకంతో తాను రష్యాకు వెళ్ళాలని

ప్రకాశవతిని ప్రభుదత్తు రక్షణలో ఆమేధీ పంపాడు. 22 జనవరి 1932 నాడు అలహాబాద్‌లో కృష్ణశంకర్‌ను కలుసుకోవటానికి వచ్చినప్పుడు సావిత్రీదేవి ఇంట్లో ఆయన బందీ అయిన విషయం ముందే తెలుసుకొన్నాం. నైదీ అలహాబాద్, బరేలీ, ఫతేగఢ్ బిళ్ళకు మారాడు. జైళ్ళలో తీవ్రమైన హింసలకు గురిఅయ్యాడు అయినా ధైర్యాన్ని కోల్పోలేదు. ధ్యేయం సడలలేదు. శ్యాం కుమారి నెహ్రూ ఆయన వకీలు, లాహోరు ఢిల్లీ కుట్రలు, వైస్రాయి స్పెషల్ కూల్చినకేసు ఒకేసారి నడిచినయ్. జైలులోని లా పుస్తకాలు చదివి సలహాలు పంపించేవాడు. హత్యాప్రయత్నానికి ఏడేండ్లు అనుమతిలేక ఆయుధాలు ఉంచుకొన్నందుకు ఏడేండ్లు మొత్తం 14 ఏండ్లు కారాగార శిక్షపడింది. జైలులో తన తీపి చేదు అనుభవాల నెన్నింటినో యశపాల్ "సింహావలోకనం"లో వర్ణించాడు.

కళ కళ కోసం అన్నట్లు కాక జనచైతన్యం కోసం అని భావించిన ఉత్తముడు. నటన ఆయన వలన కాలేదు. అన్నది ఆచరించి చూపాడు. మత విశ్వాసాలు లేవు ఆయన పిల్లలపెళ్ళి మతాచారాలు లేకుండా చేశాడు. రాజకీయాల్లో పాల్గొనలేదు. ఆయన నచ్చిన కమ్యూనిస్టులోనూ సభ్యత్వం లేదు. అయినా స్వతంత్ర భారతంలో కమ్యూనిస్టుగా ఆయన్ను జైలుకు పంపి వదిలారు. నెహ్రూ కాలంలో మొదట సాయుధ పోరాట వీరుడుగా పిదప సంచలన సాహితీకారుడుగా ఆయనది సమున్నత స్థానం.

అంతటి ఆలోచనాపరుడు, అనుభవజ్ఞుడు, దేశభక్తుడు, సమాజప్రేమికుడు సాహిత్యవేత్త, సామ్యవాది కలాన్ని విడనాడకే 1976 డిసెంబర్ 25తేదీన తన 73వ ఏట మనల విడనాడిపోయాడు.

జీవితాంతం దేశం కోసం జనం కోసమే పరిశ్రమించాడు. ఆయన మహదాశయాన్ని ముందుకు నడిపించే బాధ్యత మనది. జాతస్యధ్రువోహి మృత్యుః, సదాశయ సంపన్నులే శాశ్వతులు.

—0—